# చరకసంహిత.

## (పూర్తిగ ఆంధ్రీకరింపబడినది)

చరకసంహిత ఆయుర్వేదగ్రంథములలోనికెల్ల అత్యుత్తమమైనదనియు, ఈ గ్రంథముయొక్క ప్రభావమువలననే ఆయుర్వేద మింతవరకైనను నిలువబడియున్నదనియు ఇందు అమోఘములైన శాస్త్రవిషయములు కలవనియు అందరికిని తెలిసిన విషయమే. ఈ గ్రంథము ఇదివరలో అనేకభాషలలోనికి పరివర్తనము చేయబడియున్నది. కాని ఇంతవరకును ఆంధ్రభాషలోనికి పూర్తిగా పరివర్తనముచేయబడియుండలేదు. అందులకు అనేక కారణములు కలవు. మేము అనేకవ్యయప్రయాసలకు లోనై అట్టి ఉద్గ్రంథమ్మును పూర్తిగా ఆంధ్రీకరించితిమి. మరియు మొత్తము పుస్తకమును గ్రాహకులకు అనుకూలముగనుండునట్లు మూడుసంపుటములుగ ప్రచురించితిమి.

### (1) చికిత్సాస్థానము.

ఇందు అనేకవిధములైనట్టియు శాస్త్రసమ్మతములైనట్టియు చికిత్సావిషయములు అనేకములు కలవు. ఆయుర్వేదమున చికిత్సావిషయక గ్రంథములలో ఇంతటి గ్రంథము లేదని అందరికిని తెలిసినవిషయమే. ఇది ప్రథమముద్రణము అయిపోయి అనేకనూతనసంస్కరణలతో ద్వితీయముద్రణము పూర్తి అయినది.

వెల రు 7—0—0 లు.

### (2) స్థానషట్కము.

నిదాన, విమాన, శారీర, ఇంద్రియ, కల్ప, సిద్ధి స్థానములను ఆంధ్రీకరించి ఏకముగ జేర్చి స్థానషట్కమనెడి పేరుతో ప్రచురించితిమి. ఇందు ఆరు స్థానములుండుటవలన ఎట్టివి ఎన్నివిషయములుండునో వేరుగ వ్రాయనవసరము లేదు

వెల రు 6—0—0 లు.

### (3) సూత్రస్థానము.

చరకమునంతను పూర్తిగ ఆంధ్రీకరింపదలచియు సంపుటములన్నియు ఒకచోట లభించినచో గ్రాహకులకు చాల సౌకర్యముగ నుండునని తలచియు అనేకములగు కార్యములను విడనాడి సూత్రస్థానమును కూడ ఆంధ్రీకరించి ప్రచురించితిమి. శాస్త్రమునకంతకును సూత్రములే ఆయువుపట్టువులుగ నుండును. అమోఘములైన విషయములను బోధించు అట్టి సూత్రములతో ఈ గ్రంథము నిండియున్నది.

వెల రు 5—0—0 లు.

ఈ పుస్తకములు కావలసినవారు గ్రంథకర్తయగు ఈ క్రిందివారికి వ్రాయవలయును.

ఆయుర్వేదభూషణ, భిషగ్వర,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి & సన్సు, రాజమండ్రి.

ఓమ్.

శ్రీరస్తు.

ఆరోగ్యమస్తు.

# అనుభవదీపిక.



గ్రంథకర్త:

"ఆయుర్వేదభూషణ" "భిషగ్వర"

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ఏ. ఎమ్. ఏ. సి.

ఆయుర్వేదౌషధరత్నాకరప్రణేత,

భస్మప్రకాశికప్రణేత,

ఆంధ్రభైషజ్యరత్నావళిప్రణేత,

చరకసంహితానువాదకుడు,

వైద్యవిజ్ఞానప్రణేత,

"కృష్ణాఫార్మసీ" వ్యవస్థాపకుడు.

**తృతీయముద్రణము 1000 ప్రతులు.**

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రణాలయమునందు

ముద్రితము.

1948.





వెల రు **1-8-0**

# విజ్ఞప్తి.

(ప్రథమముద్రణము)

ఒకయోగముప్రకారమే తయారుచేసినప్పుడు ఒకరుచేసినది యొకవిధముగను యింకొకరు చేసినది యింకొకవిధముగను తయారగుచున్నది. ఒకేపేరుగలదానిని వేరే వేరు యోగములప్రకారము తయ్యారుచేసినచో ఎట్టిభేదములుగ తయారగునో వేరుగవ్రాయ నవసరములేదు. యోగములన్నియు నిర్ధారణములుగ ప్రత్యక్షములుగ నుండవలెననెడి ఉద్దేశముతోడనే ఆయుర్వేదౌషధరత్నాకరము మొదలగు గ్రంథములను వ్రాసితిని. మరియు ఒకరు ఒకేవిధానముగ తయారుచేసినమందు ఒకప్పుడు ఒకవిధముగను ఇంకొకప్పుడు ఇంకొకవిధముగను తయారగుచున్నది. ఇట్లుండుటచే మందులను చేయువారికిగాని ఇతరులయొద్ద పుచ్చుకొని వాడుకొనువారికిగానిచాలయిబ్బందులుకలుగుచున్నవి. మరియు నట్లుండుటచే సామాన్యప్రజలయందుకూడ విశ్వాసము తగ్గుటకు కొంత అవకాశ మేర్పడుచున్నది. కాన· మందులన్నియు ఎప్పుడును ఒకేవిధముగ తయారగుటకు తగునట్లు ప్రయత్నము చేయవలసియున్నది. ఇట్టిపని ఒకరు చేయదగినదికాదు. అందుచే నేను చాలమందితో సంప్రదింపగా కొంతమంది సరియైన అభిప్రాయమును ఇచ్చిరి. కొంతమంది తాటస్థ్యభావమును చూపిరి. కొంతమంది వ్యతిరేకభావమునే స్పష్టముగ వెల్లడించిరి. అప్పుడు ఈ కార్యమును నెరవేర్చుట ఎట్లని తలచి నేనొక్కడనే పూనుకొని నాశక్తికొలదియు చేయదలచి సుమారు 3 సంవత్సరములనుండియు ప్రతివిషయమును నేను స్వయముగ చూచి ఈ గ్రంథమును వ్రాసితిని. నాకొక్కనికే జ్ఞానము కలుగుట నా అభిప్రాయము కాదు. ప్రతివిషయమును ప్రతిమనుజుడును గ్రహింపవలయుననియే నా ముఖ్యాభిప్రాయము. అందుచేతనే దాపరికము ఎంతమాత్రమునులేక ప్రతివిషయమునుకూడ వ్రాసియున్నాను. ఇందు ఉపయోగకరములైన చాలవిషయములను వ్రాసియున్నాననియే నా అభిప్రాయము. కాని ఈ విషయములయొక్క ప్రాముఖ్యత మందులను చేయువారికిని గుణగ్రహణపారీణులకును మాత్రమే విశేషించి తెలియునుగాని యితరులకు విశేషించి తెలియజాలదని వ్రాయ సాహసించినందులకు మన్నింపవేడెదను. నే నింకను అనేకపరిశోధనలను చేసితిని. కాని విషయవిస్తరభీతిచేతను విషయములు అధికమైనచో అసలు విషయములు కొన్ని మరుగుపడవచ్చుననియు ఇంతవరకుమాత్రమే వ్రాసితిని. నే నింతవివరముగ వ్రాసినను కొన్నిస్థలయలయందు కొందరికింకను వారివారి మనస్సులనుబట్టి అనేకవిధములగు సందేహములు కలుగవచ్చును. కాని ఎవరికిని ఏవిధమగు సందేహము కూడ కలుగకుండ వ్రాయుట ఒకనికి సాధ్యముకాదని చాలమందికి తెలిసియేయుండును. కాని ఈ గ్రంథసహాయమున ఇంకను అనేకపరిశోధనలను చేసి చూచుకొనవచ్చుననియు అట్టివారికి ఈగ్రంథము కొంతవరకు మార్గదర్శకముగ నుండగలదనియు మాత్రము వ్రాయగలను.

ఈ గ్రంథమునందు అనేకపరిశోధనలను వ్రాసితిని. శాస్త్రప్రకారము చేయబడిన విధానముయొక్క విషయవివరములను వ్రాయుటయేగాక అనేకవిధములగు ఇతరమార్పులనుకూడ చేసి చూచి వ్రాసితిని. వానినికూడ సాధ్యమైనంతవరకు శాస్త్రమార్గముల ననుసరించికాని కొందరిపెద్దలయొక్క ఉపదేశముల ననుసరించికాని లోకసాంప్రదాయముల ననుసరించికాని చేసియే వ్రాసితిని. అవన్నియు జ్ఞానాభివృద్ధికొరకు చేయబడి వ్రాయబడినవి.



శాస్త్రప్రకారముగను, చెడిపోకుండగను, ఏవిధమగు కష్టమును పొందకుండగను ఎల్లప్పుడు నొకేవిధముగనుండునట్లునుఆయుర్వేద మందులనన్నిటిని స్త్రీలు కూడ తయారుచేసికొని వాడుకొనవలయుననియే నాముఖ్యాభిప్రాయము. ఆయుద్దేశముతోడనే యీపుస్తకమును ఇదివరలోని పుస్తకములను వ్రాసితిని.

...  ......  ...
16_11_31

ఇట్లు, గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

---

(ద్వితీయ ముద్రణము)

శ్రీ ధన్వంతరికటాక్షమువలన ఆయుర్వేదౌషధరత్నాకరము మొదలగువాని తృతీయముద్రణములుగ గావించియు చరకసంహితను సంపూర్ణముగ ఆంధ్రీకరించియు ఈ అనుభవదీపికను ద్వితీయముద్రణము గావించినందులకు మిక్కిలి సంతసించుచున్నాడను. అనుభూతములగు యోగములును విషయములును ఇంకను అనేకములు కలవు. వానినన్నిటిని గ్రంథమునందు చొప్పించినచో పాఠకులకు విసుగుదల కలుగునేమోయని వ్రాయలేదు. ఈ గ్రంథమునందలి విషయములనుగూర్చి ప్రథమముద్రణపు విజ్ఞప్తియందే అతివివరముగ వ్రాసియుండుటచే నంతకంటె వివరించి ఇందు వ్రాయలేదు. ప్రథమముద్రణమునందలి గ్రామ్యపదములను వీలైనంతవరకు సవరించి వ్రాసితిని. ఆధన్వంతరికి అనేకసహస్రప్రణామము లొనరించుచు ఈ విజ్ఞప్తిని ఇంతటితో సమాప్తినొందించుచున్నాడను.

...  ......  .....
30_6_1939

ఇట్లు, గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

# విజ్ఞప్తి

(తృతీయముద్రణము)

శ్రీమద్ధన్వంతరియొక్క కృపాకటాక్షమువలన ఈ అనుభవదీపిక యొక్క తృతీయముద్రణమునుకూడ ముద్రింపగలిగితిని. ఇదివరలోని ఈ గ్రంథముయొక్క రెండుముద్రణములయందును ఆయుర్వేదౌషధరత్నాకరము, భస్మప్రకాశిక మొదలగువానియొక్క మూడుముద్రణముల యందును వ్రాయబడిన ఉపోద్ఘాతములలో అనేకవిషయములను వివరముగ వ్రాసియున్నాను. వానిని చూచినచో అనేకవిషయములు బోధపడగలవు. కనుక అట్టివిషయములను మరల ఇచ్చట వ్రాయలేదు. నేను ఈగ్రంథమును విమర్శనాపూర్వకముగ వ్రాసినపిదప ఇంకను అనేక విమర్శనములను చేసితిని. వానిని ఆయాగ్రంథములయందు ప్రచురించితిని. అదియుంగాక నూతనములగు కొన్నిముఖ్యవిషయములను చేర్చి వైద్యవిజ్ఞాన మనెడిపేరుతో ఇటీవలనే ఒకగ్రంథమును రచించితిని. నేను ఆయాగ్రంథములయందు వ్రాసినవిషయములనన్నిటిని సమగ్రముగ పరిశీలించినచో ఆవిషయములనుగూర్చి సంపూర్ణమగు పరిజ్ఞానము కలుగగలదు. మరియు మనస్సును వికసింపచేసికొనుచు సమస్తవిషయములను స్వయముగను ప్రత్యక్షముగను చేసిచూచినచో పరిజ్ఞానము విపరీతముగ వర్ధిల్లగలదు. అట్టిఉద్దేశ్యముతోనే నేను చేసినవిమర్శనములను ఈ విధముగ ప్రచురించితిని. అనేకవిధములగు వ్యయప్రయాసలకు సహించి కేవలము ఇతరులు గ్రహింపవలెననెడి ఉద్దేశ్యముతో వ్రాయబడిన నా గ్రంథములలో గ్రహింపదగిన విషయము లేమయినను ఉన్నచో గ్రహించి నన్ను కృతార్థునిగ చేయగలందులకు కోరుచు ఈ విజ్ఞాపనమును సమాప్తి నొందించుచున్నాడను.

రాజమండ్రి
1—10—1948

ఇట్లు, గ్రంథకర్త,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.



గ్రంథకర్త:

"ఆయుర్వేదభూషణ, భిషగ్వర"

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఏ. ఎమ్. ఏ. సి.

ఓమ్.

శ్రీరస్తు.

ఆరోగ్యమస్తు.

# అనుభవదీపిక.



## మంగళాచరణము.

క॥ యోగమున వ్యాకృతిని వై
ద్యాగమమున మదిని రసన సంగతముల నీ
రోగములుగా నొనర్చిన
యోగిఁ బతంజలిని గొల్తు నుజ్జ్వలభక్తిన్.

తే॥ గీ॥ దేవదానవవందితదివ్యపాద
పద్ము వార్ధక్యరుఙ్మృత్యుభయవినాశు
నాదిదేవు సమస్తాషధార్థదాత
నభినుతింతు ధన్వంతరి నంజలించి.

చ॥ గుణము లవశ్యమైన నది గొప్పగదిద్దెడి నేర్పు సజ్జనుల్
గణుతికిఁ దెచ్చు నావిధిని గాదనువారి వివాదపద్ధతుల్
గణనకురావు; కాన శ్రమ నైకొని గూర్చిన వీవిశేషముల్
'అనుభవదీపి' కన్ దనరు; నట్టికృతిన్ రచియింపఁ జెల్లదే.



# విషయప్రారంభము

## కనకబాలసూర్యోదయము (వంట)

**10-3-29.** ఆయుర్వేదౌషధరత్నాకరములో అనుబద్ధగుచ్ఛములోని "రసం బలిం తాలక" మిత్యాదియోగము. రెండేసి తులముల చొప్పున గ్రహించి ఆరసములతో మర్దించితిమి. ఒకజగ్గంపేట కుప్పెలోపోసి 4-4-29 సాయంకాలము 7 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. రాత్రి సామాన్యపుమంటను వేసితిమి. ఆరాత్రి 12 గంటలకు కడ్డీకి మెత్తగ అంటుచున్నది. మరునాడు ఉదయమునుండి 9 గంటలకు కడ్డీకి కొద్దినలుపులో చూర్ణముమాదిరిగ అంటుచున్నది. సాయంకాలము 5 గంటలనుండియు తాళకము కడ్డీకి అంటుచు పోవుచున్నది. రాత్రి 12 గంటలకు కడ్డీకి గంధకపువాసన ఏమియు లేదు. అందుచే మంటను తీసివేసితిమి. పిదప నూరి కుప్పెలను కట్టితిమి ఆరినపిదప కుప్పెలు ఎర్రగలేక నల్లగను కొంచెము చులకనగను ఉన్నవి.

ఇది యెర్రగనుండునని శాస్త్రమునందు (ఈయోగమునందే) చెప్పబడుటయేకాక కనకబాలసూర్యోదయము ఎర్రగనుండునని వాడుక. మరియు ఇదివరలో అట్టికుప్పెలనే చూచితిమి. ఇది యిట్లుండుటకు కారణమేమని విచారింపగ- ఆయుర్వేదౌషధరత్నాకరములోని "శుద్ధ సూతం గృహీత్వాదౌ" విత్యాదినా చెప్పబడిన సువర్ణమహాబాల సూర్యోదయమనెడి యోగప్రకారముగ చేసినచో బాగుగ నుండునని తెలిసికొంటిమి. కాన- 10-6-29 ఆ యోగప్రకారము--రసము 6 తు, గంధకము 6 తు, సువర్ణభస్మ 3/4 తు, వెండిభస్మ 3/4 తు, మిగతాభస్మలు (ఒక్కొ-కటి) 3/8 తు చొప్పున వేసితిమి. ఆరసములతో బాగుగ మర్దించితిమి. ఒక కొండపల్లికుప్పెలోపోసి 2-7-29 సాయంకాలము 5 గంటలకు పొయ్యిమీదపెట్టి ఆరాత్రి సామాన్యపుమంటను వేసితిమి. 3-7-29 రోజంతయు కొంచెము ముద్దగ ఉడికినది. 4-7-29 ఉదయము నుండియు కడ్డీకి కొంచెము చెమర్చుచున్నది. ఆ సాయంకాలము 3½ కు కడ్డీకి రసము సిందూరౌషధములకువలెనే అంటుట ప్రారంభించినది.

అప్పుడు వెంటనే దింపి కుప్పెను బ్రద్దలుకొట్టి (గోరువెచ్చగ నుండగనే) సిందూరముపైన కొద్దిగనీళ్ళు చల్లితిమి. సిందూరము పైన చక్కగ పట్టినది. దీనిని తీసి తూచగ $5\frac{1}{4}$ తు॥ ఉన్నది. భస్మాదులు అడుగున నల్లగ నున్నవి. తూచగ $1\frac{3}{4}$ తు॥ ఉన్నది. మొదట సిందూరమును సీటితో నూరితిమి. చక్కని ఎరుపులో ఉన్నది. పిదప అడుగుమందును కలిపి బాగుగ నూరితిమి. కొంచెము ఎరుపు తగ్గినను చాలమంచిరంగు లోనే ఉన్నది. ఇందు కస్తూరిమొదలగువానిని చేర్చకుండగనే అసలు మందునే కుప్పెలు కట్టితిమి. $\frac{1}{4}$ తు॥ కు 4 గులివిందలు హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. 25 కుప్పెలు అయినవి. ఆరినపిదప సరిగ పావుతులము చొప్పున ఉన్నవి. కుప్పెలు ఎఱ్ఱగను బరువుగను ఉన్నవి. మొత్తము $6\frac{1}{4}$ తు॥ ఉన్నవి. 28-4-29 సీసాలో వేసితిమి.

## రజతమేహవంగరాజీయము.

20-5-29. రసము 5 తు, వంగము 10 తు, గంధకము 10 తు, వెండి 5 తు, వంతున గ్రహించి మొదట వంగమును కరగించి యందు వెండిరేకులనుకూడవేసి అవికూడ కరగినపిదప అందు పాదరసమును పోసి దింపి బిళ్ళగా పోసితిమి. ఆబిళ్ళను ఖల్వములోనూరగ చూర్ణము మాదిరిగ అయినది. అందు గంధకమును వేసి కలుబందరసముతో మర్దించితిమి. దీనిని జగ్గంపేటకుప్పెలోపోసి 12-6-29 పొయ్యిమీదపెట్టి 4 రోజులు వండితిమి. కడ్డీకి పాదరసము అంటగనే దింపితిమి. కుప్పెనుబ్రద్దలుకొట్టిచూడగ లోన మందు కొంతవరకు పిచ్చినది. (స్వర్ణవంగము వలెనె). మందునకు పైభాగమునందును క్రిందిభాగమునందును కొంత నల్లగాఉన్నది. మధ్యయందలిమందు వంగరాజీయపురంగులోనున్నది. నల్లనిదానిని కొంతవరకుతీసివేసి కొబ్బరికాయనీటితోనూరి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప కొద్దిగనలుపుకలిసినరంగులోనే ఉన్నవి. కుప్పెల మొత్తము 15 తు॥ ఉన్నది.

## నవలోహచింతామణి

4-4-30. భస్మములను ఒక్కొక్కతులముగను, ఇంగిలీకమును 2 తు॥ గను, తాళకమును 9 తు॥ గను వేసితిమి. వీనిని కలుబందరస

ముతో మర్దించి చిన్నచిన్న బిళ్ళలుచేసి మూకుళ్ళయందునుంచి సంధిబంధనముచేసి 70, 80 పిడకలతో 15-4-30 పుటము వేసితిమి. పిదప 8 తు॥ ఉన్నది. దీనిని ఆరసములతో మర్దించితిమి. $\frac{1}{4}$ తు॥ కు 4 గురివిందగింజలు హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. 32 కుప్పెలు అయినవి. ఆరినపిదప సరిగ పావలాఎత్తున నున్నవి. మరియు నల్లగను గట్టిగను నున్నవి. మొత్తము 8 తు॥ ఉన్నవి. 25-4-30 సీసాలో వేసితిమి.

పాషాణవాతరాక్షసము

1-3-30. ఒక్కొకతులముచొప్పున గ్రహించి ఆరసములతో మర్దించి చిన్నచిన్నబిళ్ళలు చేసి చిన్నపుటము వేసితిమి. పిదప రసములతో మర్దించి ఉజ్జాయింపుగ (తూచకుండగనే) కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప మొత్తముకుప్పెలు 12 తు॥ ఉన్నవి. కుప్పెలు నల్లగను గట్టిగను నుండి బాగుగనే ఉన్నవి. 6-4-30 సీసాలో వేసితిమి.

క్షయకుఠారము

1-3-30. ఒక్కొకతులముచొప్పున గ్రహించి ఆరసములతో మర్దించితిమి. చిన్నపుటము పెట్టితిమి. పిదప మునగవేళ్ళరసముతో బాగుగ మర్దించి కుప్పెలుకట్టితిమి. $\frac{1}{4}$ తు॥కు 6 గురివిందగింజలు హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. 53 కుప్పెలు అయినవి. ఆరినపిదప సరిగా పావుతులముచొప్పున ఉన్నవి. మరియు నల్లగను, నున్నగను, గట్టిగను నుండి బాగుగనే ఉన్నవి. కాని కత్తిరింపగ రాయివలె గట్టిగ లేవు. మొత్తము 13 తు॥ ఉన్నవి.

లక్ష్మీవిలాసము (లఘు)

20-4-29. ఇంగిలీకమును 10 తు॥ గ్రహించితిమి. కోడిగ్రుడ్డునకు నెత్తిమీద కొద్దిగచిల్లిపొడిచి తెల్లసొనతీసి దానితో నూరి ఆ తెల్లసొననే పోసి పలుచనగచేసి ఎర్రసొనకూడ తీసివేయబడిన ఆడొల్లలలో రెండింటిలో పోసి పైన మరల కొద్దిగ తెల్లసొనపోసితిమి. ఒక డాకలో సుమారు నాలుగుఅంగుళములదళముున (లోతున) ఇసుకను పోసి అందులో ఆగ్రుడ్లను మూతులుకనపడునట్లుపెట్టి పైన ఒక డాకను బోర్లించి ఒకగంట సామాన్యపుమంటచే వండి పైడాకను తీసి గ్రుడ్లు

లోనికి కడ్డీవేసి నొక్కిచూడగా గట్టిగనున్నట్లు కనబడుటచే దింపితిమి. చల్లారినపిదప పైపెంకులనుతీయగ గడ్డకట్టి గట్టిగనున్నది. దానిని కోడి గ్రుడ్ల తెల్లసొనతోనే నూరి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప గట్టిగను ఎర్రగనునుండి బాగుగనే ఉన్నవి.

9-4-30. 15తు॥ ఇంగిలీకమును పైవిధముగానే చేసి 3 గ్రుడ్ల లో పెట్టి మధ్యాహ్నము 3 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. చిన్న మంటనువేయుచు 5½ గంటలకు చూచి దింపితిమి. అప్పుడు చూడగ క్రిందిటిమారువలె గట్టిపడలేదు. మరునాడు చూచునప్పటికి బాగుగా గడ్డకట్టి ఉన్నది. తెల్లసొనతోనూరి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప ఎందు చేతనోగాని ఇదివరలోని కుప్పెలవలె అందముగ లేవు. మొత్తము సరిగ 15తు॥ ఉన్నది.

## తామ్రమలోహరసాయనము

16-3-29. రసము 8 తు, గంధకము 8 తు, తామ్రభస్మ 4 తు, లోహభస్మ 4 తు, వీనిని ఆరసములతో మర్దించి ఒకకొండపల్లికుప్పెలో పోసి 4-4-29 సాయంకాలము 7 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. రాత్రి సామాన్యపుమంట వేసితిమి. ఆరాత్రి 12 గంటలకు కడ్డీవేయు నప్పుడు మెత్తగ అంటుచునున్నది. మరునాడు ఉదయము 9 గంటల వరకుకూడ కడ్డీకి కొద్దిగ అంటుచునున్నది. ఒంటిగంట మొదలు మూడు గంటలవరకు కడ్డీకి కొద్దిగ చెమర్చుచున్నది. 6-4-28 ఉదయము 8 గంటలవరకు కడ్డీకి గంధకపువాసన వేయుచున్నది. ఆసాయంకాలము నకు గంధకపువాసన పోయినది. అప్పుడు మంటను మానితిమి. పిదప నిమ్మకాయరసముతో మర్దించి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప తూచగ కుప్పెలమొత్తము 16 తు॥ ఉన్నవి. కుప్పెలు గట్టిగనే ఉన్నవి.

## రజతచంద్రోదయము

10-1-28. పాదరసము 8 తు, వెండి 4 తు, గంధకము 16 తు, గ్రహించి రసగంధకములను మొదట కజ్జలి చేసి యందు వెండిభస్మమును వేసి కలుబంద, ఎర్రప్రత్తిపూవుల రసములతో బాగుగ మర్దించితిమి. దానిని ఒకకొండపల్లికుప్పెలో పోసి రెండుదోజులు వండి దింపితిమి.

పాకము కొద్దిగ హెచ్చువచ్చినది. సిందూరము 6 తు॥లును అడుగు మందు 5 తు॥లును ఉన్నది. మొత్తమును కలిపి కలుబందరసముతో నూరి కుప్పెలుకట్టితిమి. కుప్పెలను ఆరినపిదప ముట్టుకొనగనే విడిపోవు చున్నట్లును ఉప్పొంగుచున్నట్లును ఉన్నవి.

12-4-29. రసము 8 తు, వెండి 4 తు, గంధకము 16 తు, గ్రహించి మొదట వెండిని కలుచనిరేకులుగ చేయించి చిన్నచిన్న ముక్కలుగ కత్తిరించి వానిని రసమునందు వేసి 2-3 రోజులు నూరితిమి. రేకులు కొంతవరకు రసములో కలిసినవి. పిదప గంధకమును వేసి రసములతో మర్దించితిమి. దీనిని పింగాణీగిన్నెల సంపుటములో పోసి (వాలుకాయంత్రమునందు) వండితిమి. 12-5-29 ఉదయము 9-30 నిమిషములకు పొయ్యిమీదపెట్టి మంటను ప్రారంభించితిమి. 13-5-29 రాత్రివరకు చెమర్చుచు ఉడుకుచునేఉన్నది. ఆరాత్రి చెమర్చుట కొంతవరకు తగ్గినది. 14-5-29 ఉదయము చెమర్చుట సాంతముగ తగ్గినది. ఆసాయంకాలమువరకు కూడ ఆలాగుననేఉన్నది. ఆరాత్రి 12 గంటలనుండియు కడ్డీకి గంధకపువాసన వేయుటలేదు. ఆ తెల్లవారుఝామున 5 గంటలకు మంటను చల్లార్చితిమి. చల్లారిన పిదప తీయగ సరిగలేదు. గంధకమింకను కొద్దిగనున్నది. అందుచే మరల గంధకమును కొద్దిగజేర్చి నూరి ఒకకొండపల్లికుప్పెలో పోసి 12-6-29 పొయ్యిమీద పెట్టితిమి. 3 రోజులు వండితిమి. పాదరసము కడ్డీకిపట్టినప్పుడు మంటను తీసివేసితిమి. చల్లారినపిదప కుప్పెను బ్రద్దలు కొట్టిచూడగ సిందూరము బాగుగ పట్టియుండలేదు. క్రిందనున్న వెండి కొంత ముద్దకట్టియున్నది. కాన వెండిని తక్కువగవేయుటగాని లేక భస్మమువేయుటగాని మంచిదని తోచుచున్నది. మొత్తమును బాగుగ మర్దించి కుప్పెలుకట్టగ, కుప్పెలు విశోషించి గట్టిగలేవు. మరియు కొద్దిగ నల్లగనున్నవి.

6-11-30. 8 తులముల రసములో 2 తులముల ఝరీవెండిని వేసి నూరగ మెత్తగ ముద్దవలె (సుమారు వెన్నవలె) అయినది. అందు 16 తు॥ గంధకమును చేర్చి కొద్దిగనూరి కలుబందరసమును

పోసి 1-2 రోజులు మర్దించి ఆరినపిదప చూడగ కొద్దిగ తెల్లగనే ఉన్నది. కాని దానిని పొడిగనే (ద్రవము పోయకుండగనే) 2-3 రోజులు బాగుగనూరగ క్రమముగ నల్లగనయినది. పిదప కలుబంద రసమును పోసి మర్దించి ఒక కొండపల్లికుప్పెలో పోసి 16-12-30 సాయంకాలము 5 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 20-12-30 సాయంకాలము 4 గంటలకు పాదరసము కొద్దితెల్లగపట్టుట ప్రారంభించినది. వెంటనే కుండనుదింపి కుప్పెనుతీసి బ్రద్దలుకొట్టి సిందూరముమీద కొద్దిగనీళ్ళు చల్లితిమి. పిదప సిందూరాదులను తీసితిమి. పైసిందూరము 6 తులములు ఉన్నది. అడుగున వెండి గడ్డకట్టి కొద్దిగ నల్లగ 2 తు॥ ఉన్నది. పైనుండిరాలిన సిందూరమును, అడుగున వేరుగనున్న పిష్టును కలిసి 2 తులము లున్నది. మొత్తము సరిగ 10 తులము లున్నది. గడ్డకట్టినవెండిని మొదట ఖల్వములో వేసి నూరగ త్వరలో మెత్తగ చూర్ణమువలె అయినది. అందుచే సిందూరాదులనుకూడ కలిపి కలుబందరసముతో బాగుగ మర్దించితిమి. $\frac{1}{4}$ తు॥ కు 6 గురివిందగింజలు హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. 35 కుప్పెలు అయినవి. ఆరినపిదప కొంచెము ఎరుపు తగ్గియున్నను బాగుగనేఉన్నవి. ఇదివరలోకంటె బాగుగ గట్టిగనే ఉన్నవి. బాగుగ ఆరినపిదప తూచగ సరిగ పావలావెత్తుచొప్పున నున్నవి.

## మహావాతవిధ్వంసి

25-6-28. ఒక్కొక్కతులముచొప్పున వేసి ఆరసములతో మర్దించి మూతిపొడుగుగల తేజాపకుప్పెలో వాలుకాయంత్రమునందు వండితిమి. సరిగ 48 గంటలు (2 రోజులు) వండునప్పటికి కడ్డీకి గంధకపువాసన పోయినది. అప్పుడు మంటను చాలించి చల్లారిన పిదప తూచగ 15 తు॥ ఉన్నది. అప్పుడు 15 తు॥ నాభినిచేర్చి పిదప చెప్పబడిన రసములతో మర్దించి కుప్పెలు కట్టితిమి. నల్లగను కొంచెము గట్టిగను నుండి బాగుగనే ఉన్నవి.

## భావనపుంతి

13-5-30. ఆంధ్రభైషజ్యరత్నావళి (ద్వితీయముద్రణము)

ఆభాగములకు 6 రెట్లుగ గ్రహించితిమి. మొదట శుంఠిని చిన్నచిన్న ముక్కలుగ చేసితిమి. రసములు త్వరలో ఎక్కుటకును పిదపకూడ కొంచెము మెత్తమెత్తగ ఉండుటకును ఆముక్కలను కొద్దిగ నలియ కొట్టితిమి. మొదట పులికడుగునుపోసి 3 రోజులు భావనచేసితిమి. 3వ నాటికి ముక్కలు బాగుగఉబ్బి (లావెక్కి) మెత్తగ బాగుగనే ఉన్నవి. కాని ఒకవిధమైన కొద్ది చెడువాసన కలిగినది. అందుచే నీళ్ళు పోసి ఆముక్కలను వాసనపోవువరకు బాగుగ కడిగితిమి. పిదప బాగుగ ఎండబెట్టితిమి. చెడిపోవునేమోయనితలచి మజ్జిగతో భావన చేయలేదు. మిగిలినరసములను కొద్దికొద్దిగ పోయుచు మూడేసి రోజులు భావనచేసి సైంధవలవణాదులను చేర్చి నిమ్మకాయరసమును పోయుచు భావనచేసితిమి. దానిని కొంతతడి యుండగనే ఝాడీలో జాగ్రత్తచేసితిమి. ఇది సరిగ నొకఝాడీ (సుమారు 35, 40 పౌనులకలది) నిండుగ అయినది. కొంతకాలమైనపిదప చూడగ తడిగను, ముక్కలు కొద్దిగట్టిగను, పుల్లగను నుండి బాగుగనే ఉన్నది. ఏమియు చెడలేదు.

## భావనజీలకర్ర

10-5-30. ఆంధ్రభైషజ్యరత్నావళిలోని భాగములకు రెట్టింపు చొప్పున గ్రహించితిమి. జీలకర్రను పరిశుభ్రముగ బాగుచేసితిమి. పిదప పుల్లని మజ్జిగనుపోసి మూడురోజులు భావనచేసితిమి. మూడవనాటికి దుర్వాసన కలిగినది. మజ్జిగయొక్క స్వభావముచే అట్లు కలిగినదని తలంచి ఆజీలకర్రను పారవేసితిమి. జీలకర్రను మరల గ్రహించి కలితోడను, అల్లపురసముతోడను (వీనిని బహుకొద్దిగనే అనగా జీలకర్ర తడియునంతవరకే పోయుచు) మూడేసి రోజులు భావనచేసి బాగుగ ఎండబెట్టి పిదప సైంధవలవణమును, కల్కములను చేర్చి నిమ్మకాయరసముతోడను, మాదీఫలరసముతోడను (ఈరసములనుకూడ కొద్దిగనేపోయుచు) పులుపు బాగుగ కలుగువరకు భావనచేసి బాగుగ ఎండబెట్టి ఝాడీలో జాగ్రతచేసితిమి. అవసరము కలిగినప్పుడు కొద్దిగ నిమ్మకాయరసమును కలుపుకొనుచుగాని లేక పొడిగనేకాని ఉపయోగించుచుంటిమి.

పుల్లనిరసము లే అయినను తడి హెచ్చుగనున్నచో క్రమముగ బూజుపట్టి ముద్దలుముద్దలుగ అయి చెడిపోవుటయేకాక పురుగులు కూడ పుట్టును.

## భావనకరక్కాయ.

8-3-30. 20 శేర్ల కరక్కాయలను గ్రహించితిమి. చితకకొట్టి లోన గింజలను తీసివేసి పైబెరళ్లను తీసికొంటిమి. వీనిని పెద్ద కాగు (కళాయి) లో పోసి 70-80 శేర్లనీళ్లు పోసితిమి. మరునాటికి ఉబ్బి కాగునిండా ఉన్నవి. వానిని క్రిందను మీదను కలుపుచు ఆనీళ్లు పారపోసితిమి. క్రొత్తనీళ్ళు పోయుచు ఇట్లు 5-6 సార్లు కడిగితిమి. పిదప నిండుగ నీళ్ళు పోసి ఉంచి మరునాడు అటులనే చేసితిమి. ఇట్లు 4-5 రోజులు చేసితిమి. అనగా ఆముక్క నోటిలో వేసికొనినచో ఏమియువగరు లేనంత వరకు చేసితిమి. పిదప బాగుగ ఎండబెట్టితిమి. రెండువీసెల సైంధవ లవణచూర్ణమును కలిపి ఒక పెద్దకుండలో వేసి పుల్లగను చిక్కగను నున్న మజ్జిగను ఆముక్కలు బాగుగనిండువరకు పోసి 3 గంటలు మెల్లగ ఉడికించి మరునాడు జీలకర్రచూర్ణమును 30 తులములుగను, మిగిలినచూర్ణములను 40 తులములచొప్పునను కలిపి అల్లపురసమును పోసి 5-6 రోజులు భావనచేసి పిదప నిమ్మకాయరసమును పోయుచు బాగుగ పులుపుకలిగి రుచిగ నుండువరకు భావనచేసితిమి. తడి అధికముగ నుండగనే ఝాడీలలో వేసితిమి. సుమారు $1\frac{1}{2}$ ఝాడీ (సుమారు 35-40 పౌనులవి) అయినవి. పిదప ఎంతకాలమునకు చూచినను తడిగ పుల్లగ బాగుగనే ఉన్నది. బూజుపట్టుట మొదలగునవేవియు కలుగ లేదు.

దీనికి పూర్వమునందుగాని తరువాతనుగాని చేసినవికూడ పై విధముగానే ఉన్నవి. కాని చేసినప్పుడెల్ల కల్కాదులయందు కొద్ది భేదముతో (పరిమాణమునందు) చేసితిమి. కాని రుచి మొదలగువాని యందు విశేషించి భేదమేమియు లేదు.

ఆ 20 శేర్ల కరక్కాయలయొక్క ముక్కలయందు నీళ్ళుపోసి మరునాడు చూడగ బాగుగఉబ్బి ఆ పెద్దపాత్రనిండుగ అగుటచే 5-6 ఝాడీల ఔషధము అగునేమోయని యనుకొంటిమి. కాని ఎండబెట్టి

కల్కాదులనుచేర్చి భావనలనుచేసిన పిదపకూడ 1½ రుఝాడీమాత్రమే అయినది.

నీళ్లు బాగుగపోయుచు వగరు పూర్తిగనశించువరకు 5-6రోజులు పైవిధముగచేసినచో, శ్రమపడి విశేషముగు భావనలను చేయునక్కర లేకుండగనే త్వరలో రసములు ఎక్కి పుల్లగ బాగుగ ఉండును. కాని కరక్కాయయందలి వగరును మొదట నీటితోనే అంతయు (పూర్తిగ) తీసివేయుటచే కరక్కాయయందలి గుణము నశించునేమోయనెడి సందేహము కలుగుచున్నది.

## తామ్రమైనము.

92-28. డాకు రేకులు ¼ వీసె, వస్త్రకాళితముచేసిన గంధకపు చూర్ణము ½ వీసె, వీని నొకడాకయందు వేసి నిమ్మకాయరసమును పోయుచు ఎండయందుంచుచుంటిమి. ఇట్లు తామ్రము అతిసూక్ష్మముగకూడ (వ్రేళ్ళతో నలిపి ఎండయందు చూచినను) కనపడకుండు వరకును, ఛర్ది ఏమియు లేకుండువరకును (సుమారు 20-25 రోజులు) చేసితిమి. తుదకు బాగుగఆరనిచ్చి కొద్దిగ తేనెనువేసి మర్దించితిమి. తు1కి 2 చిన్నములును, ½ తు1కి 1 చిన్నమును హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. తు॥ కుప్పెలు 70, ½తు॥ కుప్పెలు 90 (మొత్తము 115 తు॥) అయినవి. ఆరినపిదప చాలరోజులకు చూచినను తూకము సరిగనుండి మెత్తగను (పైనకొద్దిగఆరి) పుల్లనివాసనగను నల్లగను నున్నగను బాగుగను నున్నవి.

తరువాత 2,3 సార్లు చేసితిమి. అపకూడ పైవిధముగనే ఉన్నవి. పింగాణీగిన్నెలయందుంచికూడ పైవిధమున తయారుచేయవచ్చును.

ఇది రెట్టింపుగంధకముతో కూడుకొని ఉండుటచేతను, చాల దినములు నిమ్మకాయరసముతో భావనచేయబడి యుండుటచేతను, ఛర్ది ఏమియు లేకుండుటచేతను, మృదువుగనుండుటచేతను దీనిని పుటముపెట్టినచో భస్మయగుటయేకాక మృదువుగనుండి ఛర్దిలేని భస్మయగునని తలచి 2,3 తు॥ను తీసి బిళ్ళలుగచేసి చిన్నపుటము పెట్టితిమి. మృదువుగ నల్లగ భస్మ అయినది. కాని కొంత ఛర్ది ఉన్నది.

## శంఖద్రావకము.

14-4-28. ఆంధ్రభైషజ్యరత్నావళిలోని భాగములకు నాలుగు రెట్లుచొప్పున వేసితిమి. అన్నిటినికలిపి దంపగ బాగుగ ముద్దవలె కాలేదు. కొద్దిగ పొడిపొడిగనే ఉన్నది. దీనిని మామూలుగ తిర్యక్పాతనయంత్రమునందు వేసి ఉదయమున 9 గంటలకు పొయ్యిమీద పెట్టి సామాన్యపుమంటను ప్రారంభించితిమి ఒకఅరగంటవరకు దిగుట ప్రారంభింపలేదు. పిదప దిగుట ప్రారంభించి 11½ గంటలకు అంతయు పూర్తిగ దిగిపోయినది. మొత్తము 2½ గంటకాలమునకు ద్రావకము అంతయు దిగినది. మొదట నీరువలెదిగి తరువాత క్రమముగ మంచి రంగులో దిగినది. మొత్తము 16 ఔన్సులు అయినది నిలవయున్న కొలదియు చక్కనిరంగులోనికి మారినది. (తిర్యక్పాతనయంత్రవిధానమువగైరాలకు ఆంధ్రభైషజ్యరత్నావళిలోని ఈ యోగము యొద్ద చూడవలయును).

25-8-30. ఈసారి 5 రెట్లుచొప్పున వేసితిమి. అన్నిటినికలిపి దంచగ పొడివలెనే ఉన్నది. మద్రాసులో చేయునప్పుడు దంచగనే ముద్దవలె అయ్యెడిది. ఇప్పుడు ఎందుచేత అట్లగుట లేదోయని ఈ పొడిలో సుమారు 3-4 తులముల నీళ్ళు పోసి మరల దంచగ బాగుగ ముద్దవలె (పలుచనిముద్దవలె) అయినది. దీనిని మామూలుగ, 26-8-30 మధ్యాహ్నము 3 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి సాయంకాలము 6 గంటలకు దిగిపోయినది. ఈసారి, పొయ్యిమీద పెట్టిన వెంటనే దిగుటప్రారంభించినది. మొదట తెల్లగ నీరువలె దిగుట ప్రారంభించి క్రమముగ ఎఱ్ఱగదిగినది. మొత్తము 20 ఔన్సులు అయినది. నిలవయున్న కొలదియు చక్కనిరంగులోనికి మారినది.

కొద్దినీళ్ళు కలియుటచే వెంటనే దిగుట ప్రారంభించినట్లు తలచితిమి.

మందుదిగునట్టి కుండమీద నీళ్ళను కొద్దిగ పోయుచున్నను మందులో ఏదోవిధముగ పడునేమోయని ఈసారి కుండమీద తడిగుడ్డలను వేయుటకూడ మాని, నీళ్ళు బాగుగ పిండబడుచున్న తడి

గుడ్డతో మందుకుండను అంతటను చల్లగ నుండునట్లు తుడుచుచుంటిమి. ఇట్లు చేసినచో ఒకనీటిబొట్టుకూడ మందులో కలియదు.

జీలుగుబెండుమూత నుంచినచో త్వరలో తిని వేయుచు (హరింప చేయుచు) ఘాటుగ బాగున్నది.

మొదట ఆకొద్దినీటినికూడపోయనిచో ఇంకను బాగుండెడిదేమో.

## మాణిక్యరసము.

13-4-28. 4 తు॥ తాళకమును మెత్తగనూరి 1 తు॥ను ఒక పెద్ద మూకిటిలోను, 3 తు॥లను ఇంకొక పెద్దమూకుటిలోను వేసి పైన వేరువేరుగ పెద్దమూకుళ్ళను బోర్లించి బాగుగ సంధిబంధనముచేసి ఆరినపిదప, 15-4-28 ఉదయము 9 గంటలకు పొయ్యిమీద పెట్టి సామాన్యపు మంటను వేసితిమి. 1 తు॥ను వేసిన సంపుటమును 9½ కును (అరగంటకే), 3 తు॥లను వేసిన సంపుటమును 12 గంటలకును (ఎట్లుండునో చూచెదమని ఉజ్జాయింపుగనే) దింపితిమి. చల్లారిన పిదప సంధిబంధనమును విప్పిచూడగ రెండుసంపుటములలోని మందు బాగుగనేయున్నదని చెప్పవచ్చును. కాని 1 తు॥ మందు కొద్దిలేతగను, 3 తు॥ల మందు కొద్ది ముదరగను ఉన్నట్లు కనబడినది. మధ్య రకముగా (లేతముదురులకు మధ్యరంగులో) వచ్చినచో మంచిది. కాని అట్లువచ్చుట కష్టము. మొత్తముమీద బాగున్నది. మొత్తము మందును తూచగ 4 తులములకు 1 తు॥ తగ్గినది. మూకుళ్ళను కొంత పట్టిఉన్నది. కాలేదు. అందుచే కొంత తగ్గియుండవచ్చును.

ఇతరవిధముగ చేసిన పరిశోధనలన్నిటిని మా ఇతరపుస్తకముల యందు వివరముగ వ్రాసియుండుటచే మరల నిందువ్రాయుట అనవసరమని తలచితిని.

ఏవిధానముగ చేసినను కొంతమందు (మొదట వేసిన పరిమాణమునకు) తగ్గును.

## నారికేళాంజనము.

13-5-30. ఆంధ్రవైద్యరత్నావళి ద్వితీయముద్రణము 161 పేజీ. ప్రమాణపనుపు మొదలగువానిని ప్రత్యేకముగ అయిదేసితులముల

చొప్పున గ్రహించి నలియఁగొట్టి 120 తులముల కొబ్బరికాయనీటిని పోసి 8 వ వంతు మిగులునట్లు కాచి వడకట్టి దానిని కొద్దిగ చిక్కగ నగువరకు మరలకాచి యందు ½ తు॥ పచ్చకర్పూరమును, 1 తు॥ సైంధవలవణమును, 5-6 తు॥ తేనెను కలిపి ఖల్వములో బాగుగ మర్దించి చిక్కగ నుండుదానిని జాగ్రత్తచేసితిమి.

నేను శ్రీగోపాలాచార్యులుగారి వైద్యశాలలో వైద్యునిగను మందులనుచేయించువానిగను నున్నప్పుడు తయారుచేసిన విధానము నొకదాని నిచట నిరూపించుచున్నాడను.

12-10-1918. మ్రానిపసపు మొదలగువానిని ఆరేసితులము లుగ గ్రహించి నలియఁగొట్టి ఆరుగ్రస్థముల అనగా ద్రవ్యముల మొత్తమునకు 16 రెట్లు (288 తు॥) కొబ్బరికాయనీళ్ళుపోసి 8వ వంతు మిగులునట్లు కాచి వడియఁకట్టి మరల కొద్దిచిక్కగకాచి యందు 10 అణాలయెత్తు పచ్చకర్పూరమును, 10 అణాలయెత్తు సైంధవలవణమును, 18 తులముల తేనెను కలిపి ఖల్వములో రెండుఝాములు నూరి జాగ్రత్తచేసితిమి.

యోగమునందు భాగములను సిద్ధారణగ చెప్పకపోవుటచే పరి భాషల ననుసరించియు సాంప్రదాయముల ననుసరించియు భాగములు మొదలగువాని ననేకవిధముల పరికల్పించుకొనుచున్నారు.

## అమృతభల్లాతక లేహము.

19-3-30. ఆంధ్రభైషజ్యరత్నావళిలోని భాగములప్రకారము. 192 తు॥ జీడిగింజలను గ్రహించి ఇటుకచూర్ణముతో కలిపి మూట కట్టి ఘర్షణచేసి కడిగి ఆరనిచ్చి ముక్కలుగకత్తిరించి నాలుగురెట్లు నీటియందు నాల్గవవంతు మిగులునట్లు కాచి యందు సుమారు 2 శేర్ల ఆవుపాలను కలిపి నాల్గవవంతు మిగులునట్లు కాచి యందు సుమారు 1 శేరు నేతిని కలిపి చాలవరకు కాచి సుమారు ముప్పావు శేరు పంచదారనుకలిపి కలియఁత్రిప్పి ఝాడీలో జాగ్రత చేసితిమి.

ఇది కొద్దిరోజులకు బూజుకట్టి చెడిపోయినది. తుదకు నేతి యందు జలభాగ మేమియు లేనట్లు అనగా ఘృతపాకముగ కాచి యందు

పంచదార వేసినచో నిలవయుండవచ్చును. కాని పలుచగనుండును. అందుచేతను, కొన్నిస్థలములయందు నేను చూచినది విరవిరలాడుచు నుండుటచేతను ఈక్రిందివిధముగ చేసితిమి.

కొంతవరకు పైవిధముగ జేసితిమి. జీడిగింజలను అధఃపాతన యంత్రమునందు [గంధకమును శుద్ధిచేయు నప్పుడువలె] చిన్నపుటము పెట్టితిమి. క్రిందికుండలోనికి సుమారు 30 తులముల తైలము దిగినది. సారము బాగుగ వచ్చునని తైలమును తీసితిమి. ఆముక్కలలో ఇంకను సారమున్నచో వచ్చునేమోయని మరల కషాయమును కాచితిమి. ఆ కషాయమును వడగట్టి అందు ఆవుపాలనుకలిపి బాగుగ కాచి పిదప నోకవీసెడు పంచదారను, ఆతైలమును కలిపి చిక్కని పాకము వచ్చువరకు ఉడికించి 30 తులముల నేతిని కలిపి ఒకసారి ఉడుకనిచ్చి దింపితిమి మరునాటిఉదయము చూడగ గడ్డకట్టిఉన్నది. పైన నెయ్యి పేరుకొని గడ్డకట్టిఉన్నది. దానిని ముద్దలుగ మందునకంటకుండనుండు నంతవరకు తీసివేసితిమి. క్రిందిమందు గట్టిగ ఉన్నది. కలియత్రిప్పగ ఇదివరలో నేనుచూచినట్లు ఇసుకవలె గరగరలాడుచు మృదువుగను చపురుకక్కుచును చేతికి అంటకుండగను బాగుగనున్నది.

నేతిని ఇంకను తక్కువగ వేయువలయునో లేక లేహముమీద తేలిన నేతినికూడ కలుపవలయునో తెలియదు.

నేతినికలిపినపిదప ఎంతవరకు కాచవలయునో యోగమునందు చెప్ప కపోవుటచేతను, పంచదారనుకలిపినపిదప కాచవలయునా లేక కాచ కుండగనే గరిటతో కలియత్రిప్పి జాగ్రతచేసికొనవలయునా అనెడి సం దేహము కలుగుచుండుటచేతను కొన్నియిబ్బందులు కలుగుచున్నవి.

## రాజమృగాంకరసము.

6-4-29. ఆయుర్వేదౌషధరత్నాకరములోని భాగముల చొప్పున (భాగమనగా తులము) వేసితిమి. నీటితో మర్దించి మరల పొడిగ చేసితిమి. పచ్చని చిన్నగవ్వలలో పెట్టి మేకపాలతో మద్దగా నూరబడిన వెలిగారముతో ఆగవ్వలముఖములనుమూసి మూకుళ్ళ యందుంచి సంధిబంధనముచేసి కొద్దిపెద్దపుటమునే పెట్టితిమి. చల్లా

రినపిదప తీసితిమి. గవ్వలలో కొద్దికొద్దిగనే మందు కనపడుచున్నది. ఆగవ్వలతోకూడ మెత్తగనూరితిమి. మొత్తము 20 తు॥ ఉన్నది. కొద్దిగనలుపుకలిసిన తెలుపులోనున్నది.

కఫచింతామణి.

16-3-29. ఆయుర్వేదౌషధరత్నాకరము ద్వితీయముద్రణము 263 పేజీ. ఒక్కొకతులము చొప్పున వేసి ఆరసములతో మర్దించితిమి. ఒక కొండపల్లికుప్పెలో పోసి 14-4-29 సాయంకాలము 7 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి సామాన్యపుమంట వేసితిమి. ఆ రాత్రి 12 గంటలకు కడ్డీకి మెత్తగ కొద్దిగ పట్టుచున్నది. పిదప ఉదయమువరకు కడ్డీకి చూర్ణముమాదిరిగ అంటుచున్నది. ఉదయము నుండియు తాళకము కొద్దిగ అంటుకొనుట ప్రారంభించినది. ఆ 10 గంటలనుండియు మణిశిల పోవుచున్నది. 16-4-29 ఉదయమునకు పోవలసినవస్తువు లన్నియు పోయినవి. కాని కడ్డీకి గంధకపువాసన వేయుచున్నది. గంధకపువాసన పోవువరకు వండితిమి. పిదప తీసి ఆ మందుతో సమానముగు కంచుభస్మము కలిపితిమి. (తుదకు వివరముగ వ్రాయకపోవుటచే ఎన్నిగంటలకు దింపినదియు ఎంత ఉన్నదియు వివరముగ వ్రాయలేక పోతిమి). పిదప చెప్పబడినరసములతో మర్దించి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప పరీక్షించి గట్టిగలేవు. అందులోనివి 4-5 కుప్పెలనుతీసి చిన్నమూకుళ్ళయందుంచి చిన్నపుటమును పెట్టితిమి. అదివరలోని కుప్పెలవలెనే ఉన్నవి. కాని ఏమియు గట్టిపడలేదు. గట్టిగలేకపోవుటకు కారణము తెలియదు.

సుమారు 5-6 మాసములు అయినపిదప ఈకుప్పెలనన్నిటిని ఏమియుచేయకుండగనే ఆయా రసములతో మర్దించి కుప్పెలుకట్టగా నిగనిగ మెరయుచు నిక్కిలి నల్లగనుండి అధికముగు గట్టితనమును కలిగి అధికముగు ఆశ్చర్యమును కలిగించినవి.

సింహాప్రతీపాలనము.

20-10-28. ఒక్కొకదానిని అణాయెత్తుచొప్పున గ్రహించితిమి. రసగంధకములను కజ్జలిచేసి మిగిలిన వస్తువులను కలిపి హంస

పాదిరసముతో మర్దించితిమి. పెద్దఆవాలవలె మాత్రలను చేసితిమి. సుమారు 256 మాత్రలు అయినవి. నల్లగ గట్టిగ బాగుగ ఉన్నవి. మాత్రల మొత్తము తూచగా 3½ అణాలఎత్తుగ నున్నవి. నున్నని చిన్న ఖల్వములో తయారుచేసితిమి.

4-7-29. పై విధముగనే చేసితిమి. 206 మాత్రలు అయినవి. మాత్రల మొత్తము 3 అణాలఎత్తుగ నున్నవి.

26-5-30. పై విధముగనే చేసితిమి. 225 మాత్రలు అయినవి. మాత్రలమొత్తము 3½ అణాలఎత్తుగ నున్నవి

మాత్రలయొక్క లెక్క (సంఖ్య)యందును, మొత్తపుతూకమునందును హెచ్చుతగ్గులుకలుగుటకు ఆయా సమయములనుబట్టి మాత్రలను కొద్దిహెచ్చుతగ్గులుగచేయుట, ఖల్వము మొదలగువానికి మందు కొద్ది హెచ్చుతగ్గులుగ పట్టు(అంటు)కొనుట మొదలగునవి కారణములుగ కనబడుచున్నవి.

తరుణార్కము.

8-11-28. మొదటి 8 వస్తువులను రెండేసిచిన్నముల చొప్పున (మొత్తము 16 చిన్నములు) గ్రహించితిమి. ఇంగిలీకమును 16 చిన్నములుగ గ్రహించితిమి. మొత్తము 1 తులము 2 చిన్నముల మందును మాదీఫలరసముతో 3 రోజులు బాగుగ మర్దించి ఆవాలవలె మాత్రలను చేసితిమి. ఎర్రగ నున్నవి. 660 మాత్రలైనవి. మొత్తము మాత్రలను తూచగా 29 చిన్నములున్నవి.

26-3-30. పై విధముగనే చేసితిమి. సుమారు పై విధముగనే యున్నవి.

9-2-31. పై విధముగనే చేసితిమి. 610 మాత్రలైనవి. మాత్రలమొత్తమును తూచగా 31 చిన్నములున్నవి. ఇదివరలోకంటె మాత్రలు కొద్దిగ పెద్దవైనట్లు తలచితిమి.

సూతికామాత్రలు.

3-1-29. ఆయుర్వేదౌషధరత్నాకరములోని (1వ రకము) యోగము. ఒక్కొక్కదానిని అణాయెత్తు చొప్పున గ్రహించి ఆ రస

ములతో మర్దించితిమి. పెసరగింజలకంటె కొంచెము పెద్దమాత్రలుగ చేసితిమి. సరిగ 86 మాత్రలైనవి.

10_8_29. పైభాగములకు రెట్టింపు అనగా ఒక్కొకటి బేడ యెత్తుచొప్పున గ్రహించితిమి మినపగింజలవలె మాత్రలను చేసితిమి. 160 మాత్రలైనవి. ఇదివరలోకంటె కొద్దిగ పెద్దమాత్రలను చేయుటచే మొత్తములో కొద్దిగ తగ్గెను.

16_7_30. పైవిధముగనే చేసితిమి. సుమారు పైవిధముగనే యున్నవి.

29_3_31. పైవిధమే.

ఒక్కొక్కప్పుడు మాత్రలు మొదటినుండియు నల్లగనేయుండెను. ఒక్కొక్కప్పుడు మొదట కొద్దిగ పచ్చగనుండి క్రమముగా నల్లబడుచుండెను.

కస్తూరిమాత్రలు.

21_7_28 గోరోజనము, పాపుదారు, జున్ను, రససిందూరము, రసకర్పూరము, ఇంగిలీకము ఈ ఆరింటిని బేడయెత్తుచొప్పునను, కస్తూరిని అణాయెత్తుచొప్పునను గ్రహించి తమలపాకులరసముతో మర్దించి అవాలకంటె కొద్దిగ పెద్దవిగ మాత్రలను కట్టితిమి. మాత్రలు ఎఱ్ఱగనున్నవి. సుమారు 600 మాత్రలైనవి.

2_10_28. పైవిధమే. రెట్టింపుచొప్పున వేసితిమి. మునగచెక్కరసముతోడను, మిరియాలరసముతోడను మర్దించితిమి. సుమారు వెయ్యిమాత్రలైనవి.

8_4_29. పైవిధముగనే చేసితిమి. 1225 మాత్రలైనవి.

23_10_29. మొదటి (21_7_28) భాగములకు ఆరురెట్లుచొప్పున వేసితిమి. తమలపాకులరసముతో మర్దించితిమి. సుమారు 3300 మాత్రలైనవి.

10_1_30. పైవిధమే.

19_8_30. పైవిధమే.

25_2_31. పైవిధమే.

ఇవి మా పుస్తకములోని యోగముల ప్రకారముగాక వేరొకసాంప్రదాయప్రకారముగ చేయబడినవి.

## సన్నమాత్రలు.

23-10-29. రసకర్పూరము $\frac{1}{8}$ తు, పాదరసము $\frac{1}{8}$ తు, రససిందూరము $\frac{1}{8}$ తు, జున్ను $\frac{1}{8}$ తు, గోరోజనము $\frac{1}{8}$ తు, మిరియాలచూర్ణము పదిఅణాలయెత్తు, ఇంగిలీకము $1\frac{1}{4}$ తు, గరళము 1 చిన్నము వీనిని తమలపాకురసముతో మర్దించి ఆవాలవలె చిన్నమాత్రలను చేసితిమి. చక్కనిఎరుపులో బాగుగనున్నవి.

ఈయోగమువిషయమై చాలమందితో సంప్రదింపగా ఒక్కొక్కరు ఒక్కొక్కవిధముగ జెప్పిరి. కొందరు సన్నమాత్రలనగా కస్తూరిమాత్రలేయని యనిరి. కొందరు సింహప్రతీపాలనమాత్రలని యనిరి. వేరువిధముగ చాలమంది చెప్పిరి. వారలయొక్క సారాంశమును గ్రహించి పైవిధముగచేసి వ్రాసితిని.

## గంధకరసాయనము.

14-9-28. శుద్ధిచేయబడిన గంధకమును నూరి వస్త్రకాళితము చేసి రెండువీసెలచూర్ణమును ఖల్వములో వేసితిమి. ఆరసములతో క్రమప్రకారము భావనచేసితిమి. తుదకు చాలవరకు ఆరబెట్టి రెండు వీసెల మెత్తనిపంచదారను కలిపి ముద్దగనుండగ ఝాడీలలో జాగ్రత చేసితిమి. అవసరముకలిగినప్పుడు సుమారు కుంకుడుగింజలంత మాత్రలను చేయుచుంటిమి.

15-10-29. పైవిధముగనే చేసితిమి.

29-8-30. పైవిధముగనే చేసితిమి.

మందు చాలపలచగనున్నప్పుడు పంచదారను కలిపినచో పాకమువచ్చినట్లు పలచగనై త్వరలో ముద్దగకాదు.

తుదకు బాగుగ ఆరబెట్టి పంచదారనుకలిపి మర్దింపగ ముద్దగ నవక పొడిగనున్నచో అల్లపురసమును కొద్దిగపోయుచు మర్దించి ముద్దగజేసి జాగ్రత చేసికొనవలయును. భావనచేయునప్పుడు రసమధికముగనై మందు మరల త్వరలో ఆరనియెడల కొంతవాసన కలుగవచ్చును. బాగుగ ఎండబెట్టినచో వాసన తగ్గును.

సరియైనముద్దగ జాగ్రతచేసికొనిన మందునకు వర్షాకాలము

నందు కొద్దిగపల్చనగుటయు, వేసవికాలమునందు కొద్దిగ గట్టిపడుటయు సంభవింపవచ్చును.

## క్రివ్యాది.

13-10-28. ఆయుర్వేదౌషధరత్నాకరమునందలి యోగములలోని మొదటియోగముప్రకారము చేసితిమి. అందులోని భాగముల ప్రకారము వేసితిమి ఆయారసములతో భావనలు చేసినపిదప కొద్దిగ తడిగనుండగనే కుప్పెలుకట్టితిమి. $\frac{1}{4}$ తులమునకు రెండు చిన్నములును, $\frac{1}{2}$ తు॥ కు మూడుచిన్నములును, 1 తు॥ కు నాల్గుచిన్నములును హెచ్చు వేసి కుప్పెలుకట్టితిమి. 104 పావుతు॥ కుప్పెలు, 116 అరతు॥ కుప్పెలు, 25 ఒకతు॥కుప్పెలు చేసితిమి. మొత్తము మందు సుమారు 109 తులములు అయినది. ఆరినపిదప కొద్దిగ గట్టిపడినను కొద్దిమెత్తగనే ఉన్నవి. మరియు అసలుతూకమునకు సరిగనున్నవి.

18-8-29. పైవిధమే కాని రెట్టింపుచొప్పున వేసితిమి. మిగిలిన విషయములన్నియు పైవానికివలె నేయని గ్రహింపవలయును.

గంధకమును సన్నని మంటయందు కరగించి కరగిన వెంటనే పాదరసమును వేసి వెంటనే భస్మలనుకలిపి వెంటనే ఆముదపాకుల యందు పోయవలయును. లేనిచో గంధకము మండుటయు, భస్మలను కలిపినపిదప పాత్రయందే గడ్డకట్టుటయు మొదలగునవి సంభవింపవచ్చును. ఆవుపేడను కుండుగ కట్టి అందు ఆముదపాకును వేసి అందు కరగింపబడిన మందునుపోసి వెంటనే పైన ఆముదపాకును వేసి ఆయాకు పైన పేడముద్దను వేయవలయును. చల్లారినపిదప గడ్డకట్టియుండును. పిదప తగువిధమున చేయవలయును.

మందు మొత్తము సామాన్యముగా 80 తు॥ ఉండవలసియుండును. కొద్దిగ తడిగ నుండగనే కుప్పెలు చేయుటచేతను, ఈమందు నందు ఉప్పును వెలిగారచూర్ణమును కలిసియుండి పుల్లనిరసము మొదలగువానితో అనేకభావనలు చేయబడుటచే కొద్దిగ చెమర్చుచు తడిగ నుండుటచేతను మందుయొక్క మొత్తపుపరిమాణమునందు కొంత యాధిక్యము కనబడుచుండును.

వెలిగారమును పొంగించినపిదపనే తూచుకొనవలసినదిగా స్పష్టముగా కనబడుచున్నది. కాని కొందరు పచ్చివెలిగారమునే భాగముల ప్రకారముతూచి పిదప పొంగించి వేయుదురు.

ఇచ్చట పలశబ్దముచే నాల్గుతులములను గ్రహించితిమి.

## సువర్ణక్రివ్యాది.

26-7-28. "సువర్ణతారే" ఇత్యాదిశ్లోకముచే చెప్పబడిన యోగముప్రకారము చేసితిమి. సగముభాగములుచొప్పున వేసితిమి. పుస్తకములోచెప్పబడిన ప్రకారము చేసితిమి. మంటనువేయుట, ఆముదపాకలలోపోయుట, కుప్పెకట్టుట మొదలగు సంగతులకన్నిటికిని క్రవ్యాదియొద్దచెప్పబడినవానిని పూర్తిగాచూడుడు.

మొత్తముమందు సుమారు 90 తులములున్నది.

15-10-29. పైవిధమే. కాని మువ్పావువంతున తయారుచేసితిమి. మొత్తము సుమారు 130 తులములయినది.

19-11-30. పుస్తకములోని భాగముల ప్రకారము చొప్పున తయారుచేసితిమి. మొత్తము సుమారు 170 తులములైనది.

## ఆనందభైరవి.

20-5-28. ఆయుర్వేదౌషధరత్నాకరమునందలి యోగములలో రెండవయోగముప్రకారము. ఒక్కొక్కదానిని పదేసితులములచొప్పున గ్రహించితిమి. శాస్త్రమునందుచెప్పబడిన ప్రకారము మర్దించితిమి. కొంచెము తడిగనుండగనే కుప్పెలుకట్టితిమి. $\frac{1}{4}$ తు॥కు 2 చిన్నములు, $\frac{1}{2}$ తు॥కు 3 చిన్నములు, 1 తు॥కు 4 చిన్నములు చొప్పున హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. $\frac{1}{4}$ తు॥కు॥ 50, $\frac{1}{2}$ తు॥కు॥ 71, ఒకతు॥కు॥ 35 కట్టితిమి.

కుప్పెలను ఆరకుండగనే వెంటనే సీసాయందువేసి జాగ్రతచేసితిమి మొత్తము మందు సుమారు 85 తులములయినది.

12-10-29 పైవిధముగనే చేసితిమి. పైవిధముగనే ఉన్నవి. మొత్తము సుమారు 80 తులములయినది.

19-8-30. పైవిధమే. ఒక్కొక్కదానిని ఇరువదేసితులచొప్పున వేసితిమి.

తడిమీదనే నిలవచేయుటచేతను, పుల్లనిరసముతో చాలదిన ములు మర్దింపబడుటచేతను నిలవచేసినపిదప చాలదినములవరకు మెత్త గనుండెను. మరియు కుప్పెలు అసలుతూకమునకు కొద్దిగ హెచ్చుగనే యుండెను.

మాదీఫలములు దొరకనప్పుడు నిమ్మకాయరసముతో మర్దింపబడెను. ఏకారణముచేతనో కాని నిలవచేసినకొంతకాలమునకు కుప్పెలు క్రమముగ కొద్దిగ నల్లగ నైనవి.

## పైత్యాంతకము.

23-4-28. ఆయుర్వేదామృతరత్నాకరము నందలి యోగము ఒలో రెండవయోగము. అల్లపుముక్కలు 7½ తు॥, జీలకఱ్ఱచూర్ణము 7½ తు॥, ఉశిరికపప్పుచూర్ణము 7½తు॥, సైంధవలవణము 7½తు॥ రస సిందూరము 7½తు॥ గ్రహించి మొదట రససిందూరమును నిమ్మకాయ రసముతో పలచగనూరి పిదప అల్లపుముక్కలను సైంధవలవణమును చేర్చి మెత్తగనూరి పిదప చూర్ణములను చేర్చి నిమ్మకాయరసముతో రెండునెలలు మర్దించితిమి. కొద్దిగతడిగనుండగనే కుప్పెలుకట్టితిమి. కుప్పెలు కొద్దిగనలుపుకలిసిన ఎరుపును కలిగియున్నవి.

3-10-28. పైవిధమే. కాని ఒక్కొక్క దానిని 10తు॥చొప్పున వేసితిమి. ½ తు॥కు 3 చిన్నములు, 1తు॥కు 5చి॥ హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. ½ తు॥ కుప్పెలు 50, 1తు॥ కుప్పెలు 25 అయినవి. మొత్తము ఏబదితులములయినది. మొత్తము కుప్పెలన్నియు తూచగ 58 తు॥లున్నవి. కొద్దిరోజులయినపిదప కుప్పెలు కొద్దిగ ఆరినను అసలుతూకమునకు 3, 4 గురివిందగింజలు హెచ్చుగానే యున్నవి.

14-10-29. పైవిధముగనే చేసితిమి. పైవిధముగనేయున్నవి.

పైవిధములుగ తయారుచేయబడిన కుప్పెలు కొంతకాలము నకు అనగా సుమారు 7, 8 నెలలకు క్రమముగా కొద్దినల్లగనైనవి. మరియు మందునకు కొద్దిగకీలుముకూడ కలిగినది. అందుచే ఆ కుప్పెల

నన్నిటినికలిపి మరల నిమ్మకాయరసమునుపోసి బాగుగ అనగా కిలుముపోవువరకు మర్దించితిమి. మందు రుచిగ బాగుగనే యున్నది. కాని చక్కని ఎరుపులోమాత్రము లేదు.

మందు క్రమముగా నల్లబడుటకు కారణము, అందు ఉశిరిక పప్పుచూర్ణము కలిసి యుండుటయే యని ఊహించితిమి. మర్దించు నప్పుడు ఇనుము మొదలగువాని సంబంధము కలుగకపోయినను యిందు కిలుము కలుగుటకు గల కారణమేదియో గ్రహింపజాలకపోతిమి.

13-2-31. ఈసారి ఒక్కొక్కదానిని 5 తులములచొప్పున వేసితిమి. మరియు 5 తులముల ఇంగిలీకమునుకూడ కలిపితిమి. మందు నిలవయున్నకొలదియు క్రమముగా నల్లబడుట మొదలగు దుర్గుణ ములు కలుగుచుండుటచే, కొద్దిభాగములను వేసికొనుచు కొద్దిరోజుల లోనే మరల తయారుచేసికొనుట మంచిదని ఈసారి కొద్దిభాగములు గనే వేసితిమి. మరియు కొంతమందియొద్ద పైత్యాంతకము చక్కని ఎరుపులో నుండుటచేతను, పైవిధముగ చేయబడినది మొదటినుండియు కొద్దిగనలుపుతోకూడిన ఎరుపుకలదిగ నుండుటచేతను, ఈపైత్యాంతక యోగములలో మొదటియోగమునందు రససిందూరము ను ఇంగిలీక మును కూడ చెప్పబడియుండుటచేతను ఈసారి ఇంగిలీకమునుకూడ చేర్చితిమి. అందుచే ఇదివరలోకంటె చక్కని ఎరుపులోనే యున్నది.

ఎప్పుడికప్పుడు తూచుకొని కుప్పెగచేసికొనవచ్చునని కొద్దిగ తడిగనుండగనే ఏకముద్దగనే సీసాలో జాగ్రతచేసితిమి. మొత్తము మందు 33 తులములున్నది.

ఈవిషయమును వ్రాయునప్పుడు ఈ మందుముద్దను చూడగా మెత్తగ రుచిగ బాగుగనేయున్నది. కాని చక్కనిఎరుపు అనగా లేత ఎరుపుపోయి ముదురుఎరుపులో అనగా ఇంగిలీకపుగడ్డయొక్క వర్ణ ములో నున్నది.

ఇందు పీచులేనిఅల్లపుముక్కలను వేయుట శ్రేష్ఠము.

వంగరాజీరకము.

16—3—28. రసము 7½ తు॥, వంగము 15తు॥, గంధకము 15తు॥

గ్రహించి తంగమును కరగించి యందు రసమునుపోసి యాగడ్డను గంధకమును కలిపినూరి కలుబందరసముతో నొకరోజు బాగుగమర్దించి ఎండినపిదప ఒక జగ్గంపేటకుప్పెలోపోసి 20-3-28 ఉదయం 9 గం॥లకు పొయ్యిమీద పెట్టితిమి. 21-3-28 ఉదయం 11 గంటలకు కడ్డీవేసి నప్పుడు మందు ఎర్రగపట్టినది. పిదప 1, 2 గంటలుఉంచి మంటను ఆర్పితిమి. చల్లారినపిదప కుప్పెను బ్రద్దలుగొట్టితిమి. మందు సామాన్యపు ఎరుపులో బాగుగానే యున్నది. మందు పైభాగమున కొంతనల్లగ నున్నది. దానిని తీసివేసితిమి. అడుగుమందు 20 తు॥ ఉన్నది. దానిని కలబందరసముతో మర్దించి కుప్పెలుకట్టితిమి కుప్పెలు బరువుగ బాగుగనే యున్నవి. కాని కొద్దిగ నలుపుకలసిన స్వర్ణవంగపు రంగులో నున్నవి. కాన పాకము ఇంకను కొద్దితక్కువయని తోచుచున్నది.

14-1-31 రసము 10 తు, వంగము 20 తు, గంధకము 20 తు॥ గ్రహించి పైవిధముగచేసి ఒకకుప్పెలోనేపోసి 22-1-31 ఉదయము 11 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆసాయంకాలము మొదలు 23-1-31 సాయంకాలమువరకు ఒక ప్రక్కన కొంత మంచి రంగువచ్చుట, ఒకప్రక్కన నల్లగవచ్చుట, ఒకప్రక్కన కొద్దిగముద్దగ పట్టుట యిట్లు ఉండుచు అడుగున గడ్డకట్టినట్లు కనబడుచున్నది. ఆ సాయంకాలమునుండియు అన్నిప్రక్కలను తడి నశించినది. ఒకేమాదిరిగ సామాన్యపురంగులో నున్నది. 25-1-31 ఉదయము 7 గంటలకు కడ్డీకి గంధకపువాసన చాలవరకు తగ్గినది. కాని రంగుమాత్రము కడ్డీకి ఏమియు తెలియుటలేదు. అప్పుడు నిప్పులను ఆర్పితిమి. చల్లారినపిదప కుప్పెను బ్రద్దలుకొట్టితిమి. కుప్పెయొక్క అడుగున 15 తులములు చక్కనిరంగులో బాగుగనున్నది. మందునకు పైభాగమున నల్లనల్లగ కొంత గట్టిగ 20 తు॥ మందు ఉన్నది. ఇన్నిదినములు ఉడికినను మందంతయు సరిగ పక్వముగాక చాలమందు నిలిచియుండుటకు కారణము, మందునంతను ఒకేకుప్పెలో పోయుటయేయని తోచుచున్నది. పైభాగమునందు మిగిలినమందును ఖల్వములోవేసి ద్రవముపోయకుండనే నూరి ఒకకుప్పెలోపోసి 10-2-31 ఉదయము 9 గంటలకు పొయ్యిమీద

పెట్టితిమి. ఆరాత్రియే 2 గంటలకు కడ్డీకి గంధకపువాసన పూర్తిగ పోయి చక్కనిరంగులో పట్టినది. అప్పుడు మంటను ఆర్పితిమి. మరునాడుదయము కుప్పెను బ్రద్దలుకొట్టగా మందంతయు చక్కనిరంగులో ఒకేవిధముగ బాగున్నది. 15 తు॥ ఉన్నది. ఇదివరలోని 15 తు॥లను, ఈ 15 తు॥లను కలపి కలుబందరసముతో మర్దించి కుప్పెలు కట్టితిమి. $\frac{1}{4}$ తు॥ కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. 106 కుప్పెలయినవి. ఆకుప్పెలు ఆరినపిదప బరువుగనున్నవి. కాని గట్టిగలేక చేతికి కొద్దిగ అంటుచున్నవి. మంచిరంగులోనే అనగా తెలుపుకలిసిన స్వర్ణవంగపురంగులోనున్నవి. ఆరినపిదప తూచగా $\frac{1}{4}$ తు॥కు 2, 3 గురివిందగింజలు హెచ్చుగనున్నవి.

## మహాకామసంజీవనీరసము.

26-7-29. ఆయుర్వేదౌషధరత్నాకరమునందు చెప్పబడిన భాగములకు నాల్గవవంతుచొప్పున వేసితిమి. (భాగశబ్దముచే తులమును గ్రహించితిమి) ఆరసములతో మర్దనను, భావనను చేసి యొకజగ్గంపేట కుప్పెలోపోసి 29-10-29 ఉదయము 9 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి 11 గంటలకు దింపితిమి. దింపినప్పటికి కడ్డీకి ఏవిధమగు వాసనయులేదు. చల్లారినపిదప తూచగా 16 తు॥ ఉన్నది. ఇందు 4 తులముల సల్లమందును కలిపితిమి. మరియు 1 తు॥ లవంగముల చూర్ణమును, 1 తు॥ జాపత్రిని, $\frac{1}{4}$ తు॥ కస్తూరిని, $\frac{1}{2}$ తు॥ పచ్చకర్పూరమును కలిపితిమి. లవంగచూర్ణము మొదలగువానికి పరిమాణమును చెప్పకపోవుటచే యుక్తినిబట్టి కలిపితిమి. పిదప చెప్పబడిన రసములతో మర్దనను, భావనను చేసితిమి. సుమారు సెనగగింజలవలె మాత్రలను చేసితిమి. ఆరినపిదప ఈమాత్రలు తు 1కి సుమారు 60 మాత్రలు చొప్పున తూగినవి. మాత్రలమొత్తమును తూచగా 22 తు॥ ఉన్నవి.

ఉమ్మెత్తవిత్తులతైలము లభ్యముకాకపోవుటచే చిక్కనికషాయమును పోసితిమి.

అరటిపండ్లను నీటియందు బాగుగపిసికి యొకరాత్రి అటులనే యుంచి మరునాడు వడకట్టి ఆరసము పోసితిమి.

## సూతికాభరణము.

26-7-29. ఆయుర్వేదౌషధరత్నాకరములో కెంటుడవయోగము (వంటయోగము). ఒక్కొకవస్తువును మూడేసితులములచొప్పున గ్రహించి యారసములతో మర్దించి పిదప ఒక కొండపల్లికుప్పెయందు పోసి 9-9-29 ఉదయము 8 గంటలకు పొయ్యిమీాద పెట్టితిమి. 10-9 29 ఉదయము 8 గంటలకు దింపితిమి దింపునప్పటికి గంధకపు వాసన మొదలగున వేవియు లేవు. చల్లారిన పిదప తూచగా 24 తు॥ ఉన్నది. పిదప యోగమునందు చెప్పబడిన పిత్తద్రవములతో భావనచేసితిమి. 2-3 రకముల పిత్తద్రవములు దొరకక పోవుటచే వానికి తగువానితో భావన చేసితిమి. తూచకుండగ ఉజ్జాయింపుగ కుప్పెలు కట్టితిము. పిత్తద్రవముతో నధికముగ భావనచేయబడుటచే, కుప్పెలు కొద్దిగ మెత్తగను కొద్దిగ దుర్వాసనగను ఉన్నవి. మొత్తముకుప్పెలు తూచగా 30 తు॥ ఉన్నవి. కుప్పెలు క్రమముగా ఆరి గట్టిపడినవి. నల్లగ నున్నవి.

## రజతనవనీతపుమాత్రలు.

15-2-29. భస్మప్రకాశికలోని యోగము ప్రకారము. 2తు॥రసములో 1 తు॥ వెండిని అరగతీయునప్పటికి గట్టిగ ముద్దమాదిరిగ అయినది. పిదప మిగిలినవస్తువులను అందులోని భాగముల ప్రకారముగ కలిపి నీటితో మర్దించి బటాణీగింజలవలె మాత్రలను కట్టితిమి.

29-4-30. సుమారు పైవిధముగనే చేసితిమి.

ఒకసారి చేయునప్పు డేకారణముచేతనో కాని మాత్రలయందు పైకి రసమో లేక రజతమో తెల్లని తళుకుగ కనపడుచున్నది.

వెండిని కడ్డీచేసి అరగతీయుట మొదలగు శ్రమలు లేకుండగ రసమునందు ఝరీవెండిని వేసి నూరినచో ముద్దగనగును. అప్పుడు మిగిలిన వస్తువులను కలుపుకొనవచ్చును. కాని ఇట్లయినచో చాలవెండి కలియనేరదు. అనగా 5-6 తులముల రసములో సుమారు 2 తులముల వెండిమాత్రమే కలియును.

## గరళము.

**24-11-28.** 180 చుక్కలను పిండించగా ఆరినపిదప 2½ చిన్నము అయినది.

20-5-29. 370 చుక్కలకు 5 చి॥ అయినది.

30-5-30. 256 చుక్కలకు 2¼ చి॥ అయినది.

**24-3-31.** 239 చుక్కలకు సుమారు 2¼ చి॥ అయినది.

## వంటబాలసూర్యోదయము.

17-1-28. ఆయుర్వేదౌషధరత్నాకరము (ద్వితీయముద్రణము) 258వ పేజీ. గంధకము 4 తు, రసము 4 తు, తాళకము 1 తు, మణిశిల ½ తు, వెలిగారము ¼ తు, ఇంగిలీకము 9¾ తు, గ్రహించిచేతాకు రసముతో 3 రోజులు మర్దించితిమి. ఒక కొండపల్లికుప్పెలో పోసి 4-2-28 ఉదయము 8 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మొదట అడుగున కడ్డీకి ముద్దగపట్టినది. క్రమముగ పలుచగ పట్టినది. పిదప తడిపట్టుటకూడ మాని కొంతసేపటికి తాళకము సరియైన రంగుగ అంటుట ప్రారంభించినది. అప్పుడు సుమారు అరగంట ఉంచి నిప్పులను ఆర్పితిమి. అప్పటికి రాత్రి సుమారు 12 గంటలైనది. అనగా 16 గంటలకు దింపితిమి. దింపునప్పటికి కడ్డీకి పాదరస మంటుట లేదు. చల్లారినపిదప కుప్పెను బ్రద్దలుకొట్టగా మధ్యయందును అడుగు భాగమునందును కొంతకజ్జలి యున్నది. దానిని తీసివేసి మిగినముందును నూరితిమి. మందు చక్కని లేతఎరుపులో నుండక ముదురు ఎరుపులోనున్నది. మందు మొత్తము 10 తు॥ లున్నది. కుప్పెలు కట్టిన పిదప గట్టిగ లేక చెదిరిపోవుచున్నవి.

పచ్చివెలిగారమునే వేసితిమి.

1-9-28. పైవిధముగనే తయారుచేసితిమి. సుమారు పైవిధముగనే యున్నది. ఇదివరలో కడ్డీకి రసము అంటకుండ తాళకము అంటుట ప్రారంభింపగనే దింపుటచే కజ్జలి మిగిలియున్నదేమోయని యూహించి ఈసారి యింకను చాలసేపు ఉంచితిమి. ప్రక్కలయందు

ఇంకను కొంతసిందూరము ఎక్కువగపట్టినది. కాని అడుగున ఇంకను కజ్జలి మిగిలియే యున్నది.

ఎన్నివిధములచూచినను అంతయు సరిగ సిందూరించి పైన పట్టకపోవుటకు కారణము తెలియదు.

9-4-29. పైవిధమే. కాని పైభాగములకు రెట్టింపు చొప్పున వేసితిమి. ఒక కొండపల్లికుప్పెలో పోసితిమి. 19-4-29 రాత్రి 12 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి 21-4-29 వ తేదీ ఉదయమువరకు కజ్జలి కొద్దిగ అంటుచునే యున్నది. ఆఉదయమునుండియు సాయంకాలమువరకు తాళకము అంటుచున్నది. 22వ తేదీయంతయు వెలిగారము అంటినది. 23 వ తేదీ ఉదయమునుండియు వెలిగారము మొదలగునవి ఏమియు అంటక కడ్డీ పొడిగనుండి ఆ మధ్యాహ్నము 2 గంటలకు పాదరసము అంటుట కనబడినది. 3, 4 గంటలకు పాదరసము బాగాపట్టినది. అప్పుడు మంటను ఆర్పితిమి. మరునాడు కుప్పెను బ్రద్దలుకొట్టగా సిందూరమంతయు పైన మిక్కిలి చక్కగ రససిందూరపు బిళ్ళలవలె పట్టినది. క్రింద ఏమియు లేదు. ఆసిందూరము తూచగా 22 తులము లున్నది. దీనిని కలుబందరసముతో నూరగా మిక్కిలి చక్కని ఎరుపులో శాస్త్రమందు చెప్పినవిధమున చాల బాగుగనున్నది. ఉజ్జాయింపుగ కుప్పెలను కట్టితిమి. ఆరినపిదప ఎర్రగనే యున్నవి. మరియు చాలబరువుగ గట్టిగ నున్నవి చేతికంటుట మొదలగు లక్షణము లేవియు లేవు.

10-2-30. పైవిధమే. గంధకము 16 తు, రసము 16 తు॥ ఈ భాగములచొప్పున వేసితిమి. 2 కొండపల్లికుప్పెలలో పోసితిమి. 21-2-30 మధ్యాహ్నము $4\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 23-2-30 మధ్యాహ్నము $4\frac{1}{2}$ గంటలకు ఒకకుప్పెను దింపితిమి. రెండవకుప్పెను ఆరాత్రి 3 గంటలకు దింపితిమి. ఒక్కొక్కకుప్పెలో సిందూరముపైవిధముననే (9-4-29) పట్టినది. ఇరువదేసి తులములు (మొత్తము 40 తు॥) ఉన్నది. రెండుకుప్పెలలోనిమందు బాగుగనే యున్నది. పాకమునకుముందు మణిశిల, తాళకము, వెలిగారము

మొదలైనవి క్రమముగా కడ్డీకంటినవి. మొదటదింపిన కుప్పెను పాద రసము బాగుగ కనబడిన పిదపనే దింపితిమి. రెండవకుప్పెను వెలిగారము చాలవరకుపోయి రసము అంటుట ప్రారంభింపగనే దింపితిమి. అందుచే, సిందూరమును సూక్ష్మముగా పరీక్షచేయగ మొదటది కొద్ది ముదురు ఎరుపులోను, రెండవది అంతకంటె కొద్ది లేతఎరుపులోను ఉన్నవి. మొత్తముసిందూరము నంతెను ఏకమునసే కలిపితిమి. ఇందుండి నుండి 20 తు॥ సిందూరమును తీసి కలుబందరసముతో 5-6 రోజులు మర్దిం చితిమి. ఎర్రగ జిగురుగ బాగుగానే యున్నది. $\frac{1}{4}$ తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప పైకి ఎర్రగ బాగుగనే యున్నవి. కాని ఇదివరలోవలె గట్టిగలేక చేతికి మందు అంటుచు నున్నవి. అందుచే మరల ఆకుప్పెలనన్నిటిని చెడగొట్టి 5, 6 రోజులు బాగుగనూరి $\frac{1}{4}$ తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి మరల కుప్పెలను కట్టి తిమి. ఆరినపిదప ఇదివరలోకంటె కొంతగట్టిపడినవి. కాని 9-4-29 కుప్పె లంత గట్టిగమాత్రము లేవు. $\frac{1}{4}$ తు॥కు 1,2 గురివిందగింజలు హెచ్చుగ నున్నవి. మిగిలిన 20 తులముల సిందూరమును అటులనే ఉంచితిమి.

12-2-30. పైభాగములవంతు (రసము 16 తు॥) వేసి పైవిధ ముగనే చేసితిమి. 19-12-30 ఉదయము 7 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 20-12-30 రాత్రి 8 గంటలకు చూచినప్పుడు వెలిగా రము అంటుట ప్రారంభించినది. ఇదివరలోవలె తాళకాదులు అంటక పోవుటచే అప్పుడు పాకము రాబోవుచున్నదని భ్రమపడి దింపుటకు సిద్ధముగానుండి కొంతసేపు బాగుగ నిరీక్షింపగ ఒకసారి కొద్దిగ మణిశిలయు, మరల వెలిగారమును, మరల తాళకమును, మరల వెలిగారమును ఇట్లు నియమములేకుండగ కడ్డీకి అంటుచుండెను. అందుచే అప్పుడు దింపుట మానితిమి. ఆరాత్రి 2 గంటలకు కేవలము వెలిగారమే అంటుచూ వచ్చినది. ఈసారి ఇదివరలోకంటె లేత పాక ముగ దింపుదమనియు, అప్పటికి కొంతమందు అడుగున గడ్డకట్టినట్లు కనబడుచుండుటచేతను ఇదివరలోవలె తాళకాదులు సరిగపోక ఒకటి రెండు రోజులకే గంధకగోళముగ పోయియుండుటచేతను ఈసారి

మందు సరిగ రాదని గ్రహించియు, లేతపాకముగ నున్నచో ఈసారి మరల వండి చూచుదమనియు అప్పుడు (2గంటలకు) రెండుకుప్పెలను కూడ దింపితిమి. మరునాడు బ్రద్దలుకొట్టగా కుప్పెలఅడుగున మందు కొంత ఇంగిలీకపుముద్దలవలె యున్నది కొంతమందు ప్రక్కలయందు గట్టిగ వ్రాసలవలె పట్టియున్నది. కొంతసిందూరము పైన పట్టియున్నది. వండునప్పుడు కలిగిన దుర్లక్షణములును, బ్రద్దలుకొట్టిన పిదప కుప్పెలయందున్న లక్షణములును రెండుకుప్పెలలోను సరిగ త్రాసులో తూచినట్లుగనే యున్నవి. రెండిటియందును మొత్తము సిందూరము 27 తు॥ను, అడుగుమందును ప్రక్కలమందును కలసి 21 తు॥ను (మొత్తము 48 తు॥) యున్నది. దుర్లక్షణములు రెండింటి లోకూడ సరిగ కలుగుటచే మర్దనయందుగాని మంటయందుగాని భేదముండునని తోచుచున్నది. లేక సమయాసమయములనుబట్టి మందునందట్టి మార్పు కలుగుచుండునేమో తెలియదు. అడుగునను ప్రక్కనను ఉన్న 21 తు॥ మందును మొదట నీళ్ళుపోసి నూరి చూడగా చక్కనిఎరుపులోనుండక కొద్దిగ నల్లగ నున్నట్లు కనబడినది. అందుచే మరలవండుదమని తలచి యందు 10 తు॥ల గంధకమునుమాత్రము చేర్చి కుకాకురసముతో మర్దించి ఒకకొండపల్లికుప్పెలో పోసి 10–2–31 ఉదయము 9 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 12-2-31 మధ్యాహ్న ము 1 గంటవరకు మామూలుగనే నల్లగ ఉడుకుచున్నది. అప్పటినుండి యు తాళకము మిక్కిలి చక్కగ కడ్డీకి ఆసాయంకాలము 4½ వరకు అంటుచుండెను. ఈరెండవసారి తాళకాదులు ఏమియు వేయలేదు. మరియు మందులోనున్నట్లుకూడ ఏమియు కనబడలేదు. అందుచే తాళకమంటినప్పుడు ఆశ్చర్యమే కలిగినది. కాని లేతపాకముగుటచే మందులోన ఇమిడియుండి యిప్పుడు పూర్తిగ పైకివచ్చినట్లు తోచు చున్నది. పిదప వెలిగారము మొదలగునవేవియు కనబడక వెంటనే (ఆ 4½ గంటలకు) రసముకనబడుట ప్రారంభించినది. అప్పుడు దింపి తిమి. మందు పైన బాగా పట్టియున్నది. ప్రక్కలనుగాని అడుగున గాని ఏమియు లేదు. మొత్తము 18 తులముల సిందూరము

ఉన్నది. మొదటివంటలోని సిందూరమును, రెండవవంటలోని సిందూరమును చక్కని ఎరుపులో బాగుగనేయున్నవి. ఇందులోని కొంతసిందూరమును తీసి కలుబందరసముతో మర్దించి ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప ఎర్రగ గట్టిగ బాగుగనే యున్నవి. కాని చేతికి కొద్దిగ అంటుచున్నవి. మరియు ¼ తు॥కు 1-2 గురివిందగింజలు హెచ్చుగనేయున్నవి.

## నవగ్రహి.

17-1-28. ఒక్కొక్కదానిని రెండేసి తు॥ చొప్పున గ్రహించి కాకరాకురసముతోడను వేపాకురసముతోడను బాగుగమర్దించి ఒక కొండపల్లికుప్పెలో పోసితిమి. కడ్డీకి రసగంధకకజ్జలి అంటుకొనుట మానువరకు వండితిమి. చల్లారినపిదప చూడగా అడుగున దుమ్మువలె 3 తు॥ మాత్ర మున్నది. దీనిని నూరి కుప్పెలనుకట్టగా సామాన్యముగు గట్టితనమును కొద్ది నలుపును కలిగియున్నవి. ఇదివరలో వండినప్పుడు మొదట కేవలము మందు అంటుకొనుచువచ్చి తుదకు తాళకము అంటినది. అప్పుడు దింపగా మందు అడుగున గడ్డకట్టియుండి చాల మందు యున్నది. దానిని నూరి కుప్పెలుకట్టగా ఆకుప్పెలు శీతాంశురసముకంటె కొంచెము తక్కువరంగుగా అనగా కొద్ది నలుపుగలిసిన పచ్చతనమును కలిగియున్నవి. మరియు చాల గట్టిగనున్నవి. ప్రతిపర్యాయమును మొదటినుండియు తాళకము మొదలగునవి యెగురుచు వచ్చినవి. ఈసారి ఎందుచేతనో మందు సరిగ రాలేదు.

22-3-29. ఒక్కొక్కదానిని మూడేసితు॥చొ॥గ్రహించితిమి. ఒక కొండపల్లికుప్పెలో పోసి 17-4-29 రాత్రి 12 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మరునాడుదయముననే చూచునప్పటికి మణిశిల తగ్గిపోవుచున్నట్లు కనబడినది. కొద్దికాలముననే తాళకము అంటుట ప్రారంభించినది. పిదప తాళకము క్రమముగా తగ్గుట ప్రారంభించినది. అప్పుడు (అప్పటికి ఉదయము 10 గంటలైనది) దింపితిము. చల్లారినపిదప బుడ్లు కొట్టగా మందంతయు గడ్డకట్టి అడుగున నున్నది. నూరి కుప్పెలను కట్టగా మంచిరంగులోనేయున్నవి. కుప్పెలుగట్టిగా బాగుగానేయున్నవి.

మొత్తము కుప్పెలు 22 తు॥లున్నవి. తాళకము అంటుట ప్రారంభింపగనే దింపినచో కుప్పెలింకను పచ్చగ నుండగలవు. మందు, దింపునప్పటికి కడ్డీకి ముద్దవలె అంటుచునేయున్నది. తాళకము అంటుట ప్రారంభించినప్పటికి మందు ముద్దగ జిగురుగ నున్నది. కడ్డీకి ముద్దగపట్టుకొనిన మందును చల్లారినపిదప విరవగా బిగిసికొని గట్టిగపట్టుకొనియున్నది.

6–12–30. ఒక్కొక్కదానిని మూడేసి తు॥చొప్పున వేసితిమి. మొదట రసగంధకములను కజ్జలిచేసి మిగిలినవస్తువులను వేసి నూరునప్పుడే మందు పచ్చగనున్నది. ఇదివరలో నూరగనే ఎట్లుండెనో తెలియదు. ఒకకొండవల్లికుప్పెలో పోసి 20–12–30 రాత్రి 4½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మరునాడుదయము 7 గంటలకు కడ్డీ వేయగా కడ్డీచిగురున కొద్దిగముద్దవలె పట్టుచున్నది. మరియు కొద్దిగ మణిశిలకూడ వచ్చుచున్నది. ఇంకొక 5,6 నిమిషములకే తాళకము బాగుగ వచ్చుట ప్రారంభించినది. అప్పుడు 10,15 నిమిషములుంచి పొయ్యిని ఆర్పితిమి. ఈసారి మొత్తము మూడుగంటలకే పాకము వచ్చినది. ఇదివరలో వలె జిగురుగ ముద్దగ ఉడక లేదు. కుప్పెలనుబ్రద్దలుకొట్టగా మందు అడుగున రాయవలె గడ్డగట్టియున్నది. కొంచెము నల్లగనున్నది. ఈగడ్డనుతూచగా 23 తు॥లున్నది. దీనిని కాకరాకు రసముతోడను, వేపాకురసముతోడను 4,5 రోజులు మర్దించితిమి. మర్దించునప్పుడు నలుపువిరిగి కొంతవరకు పచ్చతనములోనికిమారి బాగుగనున్నది. మరియు చక్కని జిగురుతనముగూడ కలిగియున్నది. ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప రెండు మూడు గురివిందగింజలు హెచ్చుగనే యున్నవి. చక్కనిరంగులో బాగుగనేయున్నవి. కాని ఇదివరలోకుప్పెలంత గట్టిగలేవు. మరియు చేతికి కొద్దిగ అంటుచున్నవి. ఈకుప్పెలనుండి 3 కుప్పెలనుతీసి చిన్న ప్రమిదిలలోపెట్టి సంధిబంధనముచేసి 2,3 పిడకలను విరచి ఆ ముక్కలతో చిన్నపుటముపెట్టితిమి. కుప్పెలు ముక్కలై బూడిదవలె మెత్తగనైనవి. కనుక పుటమువలన ఎంతమాత్రమును ప్రయోజనము

లేదు. కుప్పెలను కట్టినపిదప గట్టిగ లేకపోవుట, మందు చేతికి అంటుట మొదలగు లక్షణములుండి మందు ఇంకను పక్వముకావలసియున్నదని తోచినయెడల ఆకుప్పెలనన్నిటిని పొడిగ నేనూరి కొద్దిగంటలు మరల వండినచో మందు చాల బాగుగనుండగలదు.

రసగాట్టు.

28-6-28. మూడురెట్లభాగములచొప్పున వేసితిమి. భాగశబ్దముచే తులమును గ్రహించితిమి. కలుబందరసముతో మర్దించి బిళ్ళలనుచేసి మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి పుటమును వేసితిమి.

10-5-29. అయిదురెట్లచొప్పున వేసితిమి. పుటముపెట్టినపిదప 26 తు॥ లున్నది.

ఈరెండిటియొక్క కుప్పెలు బాగుగనే యుండియుండవచ్చును. వివరములను వ్రాసియుండకపోవుటచే అంతకంటె వివరించి వ్రాయుటకు వీలుకలుగలేదు.

15-5-29. అయిదురెట్లచొప్పున వేసితిమి. పుటమునుపెట్టినపిదప చూడగా కొంత గంధకమున్నట్లు తోచినది. అందుచే మరల దానినే పుటముపెట్టితిమి. అప్పుడుతూచగా 33 తు॥ లున్నది. కుప్పెలు ఆరినపిదప చేతికి కొద్దిగ అంటుచున్నవి. అప్పుడు ఆకుప్పెలను మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి పుటముపెట్టితిమి. పుటమునుతీయగనే చూడగా చేతికి అంటుచునేయున్నవి. కుప్పెలు మొత్తము 26 తు॥ లున్నవి. ఆకుప్పెలను మరల నూరించి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప చేతికి అంటుచున్నవి. విశేషించి గట్టిగ లేవు. అందుచే ఆకుప్పెలను మరల పుటముపెట్టితిమి. గట్టిగనున్నవి చేతికి ఏమియు అంటుటలేదు. కత్తిరింపగా గట్టిగనేయున్నవి. కుప్పెల మొత్తము 24 తు॥ లున్నవి. అన్నివిధముల బాగుండుటచే ఆకుప్పెలను ఆవిధముగనే నిలువచేసితిమి.

11-2-30. అయిదురెట్లచొప్పున వేసితిమి. 50, 60 పిడకలతో పుటముపెట్టితిమి. పిదప తూచగా 23 తు॥ లున్నది. కలుబందరసముతో మర్దించి ¼ తు॥కు ½ చిన్నము హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప ¼ తు॥కు సమానముగ నున్నవి. కుప్పెలు చాలవరకు

గట్టిగనుండి చేతికి కొద్దిగ అంటుచున్నవి. ఈమందును వేయించినచో ఎట్లుండునో చూడవచ్చునని ఈకుప్పెలను నూరి ఇనుపమూకిటిలో పోసి సుమారు $\frac{1}{2}$ గంట వేయించితిమి. మొదట ఏదియో యొకవిధమగు వాసన కలిగెను. తుదకు ఆవాసన క్రమముగా తగ్గినది. అప్పటికి మందంతయు కొద్దిగ ఎఱ్ఱబడినది. దీనిని ఖల్వములో వేసి కలుబందరసము పోసి నూరగ జిగురుగనేయున్నట్లు కనబడినది $\frac{1}{4}$ తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప $\frac{1}{4}$ తు॥కు 1, 2 గురివిందగింజలు హెచ్చుగనున్నవి. చేతికి కొద్దిగ అంటుచున్నవి. కొంతవరకు గట్టిగనే యున్నవి కుప్పెలుమాత్రము ఎఱ్ఱగనున్నవి. ఇందులోనుండి 3 కుప్పెలనుతీసి ప్రమిదలలోపెట్టి చిన్నపుటము పెట్టితిమి. కుప్పెలు గట్టిపడి చేతికి అంటుట మానినవి. కాని $\frac{1}{4}$ తు॥కు 1 చిన్నముచొప్పున తగ్గినవి.

21-4-31. రెండురెట్లుచొప్పున (రసము 2తు॥ గంధకము 16 తు॥ వంతున) కలుబందరసముతో మర్దించి చిన్నబిళ్ళలుచేసి ఒక రాత్రి ఆరనిచ్చి 10, 15 పిడకలతో పుటము పెట్టితిమి. పుటమునకు పిదప బిళ్ళలన్నియు కరిగి ఏకముగనై నల్లగ పొడిగ 15 తు॥ ఉన్నది. ఆపొడిని నిప్పులమీద వెయ్యగా కొద్దిగ గంధకపువాసన వేయుచు ముద్దగ పచ్చనిమంటతో ఉడికినది. అందుచే గంధకమున్నట్లు పూర్తిగ తలచి దానిని ఆవిధముగనే మరల పుటము పెట్టితిమి. పిదప 10 తు॥ ఉన్నది. కలుబందరసముతో బాగుగ మర్దించి, $\frac{1}{4}$తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి. 38 కు॥ అయినవి. ఆరినపిదప చాల బాగున్నవి. అనగా చేతికంటకుండనుండి మిక్కిలినున్నగను మెరయుచును చాల గట్టిగ నున్నవి. 2గురివిందగింజలు హెచ్చుగనేయున్నవి.

## వంటసువర్ణసూర్యావర్తి.

25-6-28. "సువర్ణంరజత" మిత్యాదియోగము. అర్ధభాగము చొప్పున వేసితిమి. [భాగమనగా తులము.] మొదట ఇంగిలీకమును రససిందూరమును ద్రాక్షపండ్లరసముతో పలుచగానూరి పిదప మిగిలిన వస్తువులను వేసి ఆరసములతో ఒక్కొక్కరోజు మర్దించి కోడి

గుగ్గిడ్లడొల్లలయందుంచి గుడ్డయందు మూటగట్టి డోలాయంత్రమందు మారేడివేళ్ళరసమునందు ఒకజాము వండి తీసి మారేడాకులయందుంచి పైనమట్టిపూసిన గుడ్డలచే 1, $1\frac{1}{2}$ అంగుళము దళసరిగా చుట్టి మిక్కిలి చిన్నపుటము పెట్టితిమి. పుటమునువిప్పగా గడ్డకట్టియున్నది. దీనిని కలుబందరసముతో 2, 3 రోజులు మర్దించి కుప్పెలను కట్టితిమి. ఎఱ్ఱగ గట్టిగ బాగున్నవి.

26-7-29. అర్ధభాగముచొప్పున పైవిధముగనే చేసితిమి. పైవిధముగనే యున్నది.

8-4-30. పైవిధముగనే చేసితిమి. పుటపాకముచేసినతరువాత విప్పిచూడగా ఈసారి పైన గుడ్డలు సరిగ చుట్టకపోవుటచేతనో కాని, పుటము హెచ్చగుటచేతనోకాని మందు కొద్దిగ నల్లబడినది. (దగ్ధపాకమైనది.) కాన దీనిని తీసివేసితిమి.

12-5-30. పైవిధమే చేసితిమి. ఈసారి నల్లబడలేదు. బాగుగనే యున్నది. కలుబందరసముతో మర్దించి పిదప $\frac{1}{4}$ తు॥కు ఒక చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప ఎఱ్ఱగ గట్టిగ బాగున్నవి. $\frac{1}{4}$ తు॥కు సరిగనున్నవి.

26-2-31. మరల అర్ధభాగముచొప్పున పైవిధముగనే చేసితిమి. $\frac{1}{4}$ తు॥కు 1 చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. సుమారు 115 కుప్పెలు అయినవి. ఆరినపిదప తూకమునకు సరిగ నున్నవి. ఎఱ్ఱగ గట్టిగ నున్నవి.

ఇందు పచ్చకర్పూరమును పుటపాకమైనపిదప కలుబందరసముతో నూరునప్పుడు వేయవలయును.

ఇంగిలీకము, పుటపాకము, మర్దన మొదలగువానియొక్క భేదముల ననుసరించి ఈకుప్పెలు ఒకసారి లేతయెఱుపులోను మరియొకసారి ముదురుయెఱుపులోను నుండును.

పుల్లనిద్రవములతో అధికముగ మర్దింపబడుటచే ఈ కుప్పెలు ఒక్కొక్కప్పుడు త్వరలో ఆరవు (గట్టిపడవు).

పుటపాకమునకు 4, 5 పిడకలతోనే పుటముపెట్టవలయును.

## రజతలోహరసాయనము.

28-6-28. మొదటిది "ఏకైక" మిత్యాదియోగము. రసము 8 తు॥వంతున వేసితిమి. ఆరసములతో మర్దించితిమి. ఈయోగము నందు వాలుకాయంత్రమున వంట చెప్పబడియున్నది. ఇతరయోగము లయందు పుటవిధానముకూడ చెప్పబడియుండుటచేతను, అప్పుడు కొన్నిసందర్భములచే వంటవండుటకు వీలు లేకపోవుటచేతను బిళ్లలు చేసి మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి 50, 60 పిడకలతో పుటము పెట్టితిమి. పిదప మరల ఆరసములతో మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలను కట్టితిమి. ఆరినపిదప నల్లగ గట్టిగ బాగున్నవి. కుప్పెలమొత్తము 30 తు॥ యున్నవి.

10-12-28. పైవిధముగనే చేసితిమి. కాని రెట్టింపుచొప్పున అనగా రసము 16తు॥చొప్పున. మరియు ఈసారి వాలుకాయంత్రము లోనే మూతిపొడుగుగల తేజాపకుప్పెయందు వండితిమి. ఉజ్జాయింపుగ కుప్పెలనుకట్టితిమి. నల్లగ గట్టిగ బాగుగనే యున్నవి. కుప్పెలు మొత్తము 55 తు॥ లున్నవి.

6-8-29. ఈసారి "రజతాత్ ద్విగుణ" మిత్యాదియోగము. రసము 9 తు॥ వంతున కలుబందరసముతో మర్దించి బిళ్ళలుచేసి 50, 60 పిడకలతో పుటము పెట్టితిమి. పిదప మిగిలినరసములతో మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలుకట్టితిమి. ఆరినపిదప మొత్తము సుమారు 16 తు॥ లున్నవి. కుప్పెలు నల్లగ చాలగట్టిగ నున్నవి.

ఈమూడువిధానములయందును లోహమును కొద్దిపుటములు వేయబడినదానిని వేసినట్లును, వెండిని పలుచనిరేకులుగ చేయించి కత్తిరించి వేసినట్లును జ్ఞాపకము. ఒకసారి వెండిభస్మమునువేసినట్లు జ్ఞాపకము. మరియు వెండిరేకులను మొదట రసమువందు కలిపి నూరి అవి కొంత కలిసినపిదప గంధకమును పిదప లోహమును చేర్చి నట్లును, పుటమైనపిదప కొన్ని వెండిరేకులు చిన్న చిన్న ముక్కలుగ మిగిలియుండుటచే మరల బాగుగ మర్దించి మరల పుటముపెట్టగా అన్నియు కలిసినట్లును జ్ఞాపకము. వివరములు ఇంతకంటె వ్రాయబడి యుండకపోవుటచే ఇంతకంటె వివరించివ్రాయుటకు వీలుకలుగలేదు.

11-2-30. మొదటియోగము. రసము 16 తు॥. ఈసారి జరీ వెండిని వేసితిమి. కొద్దిపుటములుపడిన లోహమును వేసితిమి. మొదట రసమునందే వెండిజరీని బాగుగ నూరి పిదప గంధకాదులను క్రమముగా చేర్చి ఆరసములతో మర్దించి బిళ్ళలుచేసి 60, 70 పిడకలతో పుటమును పెట్టితిమి. తీసినపిదప కొద్దిగంధకమున్నట్లుతోచి మరల చిన్నపుటముపెట్టితిమి. తరువాత రసములతో మర్దించి $\frac{1}{4}$తు॥కు 1చిన్నము చొప్పున హెచ్చువేసి కుప్పెలుకట్టితిమి ఆరినపిదప $\frac{1}{4}$ తు కు సరిగనున్నవి. నల్లగనున్నవి. కాని విశేషించి గట్టిగనుండక చేతికి కొద్దిగ అంటుచున్నవి. అందుచే 5,6 కుప్పెలను తీసి చిన్న ప్రమిదలలో నుంచి 7, 8 పిడకలతో పుటముపెట్టి చూడగా కుప్పెలు గట్టిగనుండి కత్తిరించనచో లోన వెండిచిమ్ముచున్నట్లుండి బిగిసికొని యున్నవి. $\frac{1}{4}$తు॥కు ఏమియు తగ్గలేదు. అందుచే అన్నికుప్పెలనుకూడ చిన్న మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి 40, 50 పిడకలతో పుటముపెట్టితిమి. పిదప పై విధముగనే చాలబాగున్నవి. అక్షరములు అదివరలోకంటెగూడ బాగుగ కనిపించుచున్నవి. చేతికి అంటుకొనుటలేదు. కుప్పెలుమాత్రము కొద్దిగ వంపుతిరిగినవి. కాని మిగిలినలక్షణము లన్నియు చాల బాగున్నవి. కుప్పెలమొత్తము 50 తు॥ లున్నవి.

8-12-30. పైయోగమే. రసము 8తు॥ వంతున. 8 తులముల రసములోను 8 తు॥ జరీవెండిని వేసి నూరబోగా మందు ఖల్వమునిండుగాయున్నట్లు తోచి రసమును వెండియు కలియునా లేదా యని సందేహము కలిగినది. కాని ఒకగంట చితకకొట్టి నూరగా రసమును వెండియు కలిసి మెత్తగ చూర్ణముమాదిరి అయినది. పిదప లోహచూర్ణమును గంధకమును చేర్చి పొడిగనే నూరగా మెత్తగనైనది. పిదప ఆరసములను పోసి మర్దించి యొకకొండపల్లికుప్పెలో పోసితిమి. ఈయోగమందే "జీవలోహము" యని స్పష్టముగ చెప్పబడియుండుటచే ఈసారి కేవలము పచ్చిలోహమునే(రజనును) వేసితిమి. బహుశః ఈకారణముచేతనే, మందును కుప్పెలో బోయునప్పుడు రజను అతిసూక్ష్మముగ చేతికి ఇసుకవలె తగులుచున్నది. మరియు మందు నల్లగ

నుండక కొంచెము తెల్లగను పచ్చగను నున్నది జరివెండిని వేయుటయు, దానిని మొదటలోనే రసమునందు వేసి నూరుటయు, అందువలన గంధకము రసమునందు సరిగ సమ్మేళనము కాకపోవుటయు ఇట్లుండుటకు కారణముగ కన్పట్టుచున్నది. 16-12-30 ఉదయము 9 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మరునాడు (17-12-30) ఉదయము 7 గంటల వరకు ఒకసారి చెమర్చుచు ఒకసారి రసనుండుచు ఉడికినది. అప్పటి నుండియు కొద్దిగ చెమర్చుచు క్రమముగా ఆ 12 గంటలకు చెమర్చుట పూర్తిగ తగ్గినది. కాని గంధకపువాసన వచ్చుచునే యున్నది. అందుచే 18-12-30 ఉదయము 12 గంటలవరకు అటులనే యుంచితిమి. అప్పటికి పాదరసము పూర్తిగ కనబడుచున్నది. కడ్డీకి గంధకపు వాసన ఏమియు లేదు. పిదప 2 గంటలు అటులనేయుంచి ఆమధ్యాహ్నము 2 గంటలకు దింపితిమి చల్లారినపిదప కుప్పెను బ్రద్దలు కొట్టగా అడుగున 43 తు॥ మందు ఉన్నది. కొద్దిగ హెచ్చుయుండుటకు కారణము తెలియదు. పైన 1 తులము సిందూరము కొద్దిగ నల్లగ పట్టియున్నది. ఈమందును ఖల్వములో వేసి ఆరసములతో బాగుగ మర్దించి ¼ తు॥ కు 1½ చిన్నమును, ½ తు॥కు 2 చిన్నములును హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. ¼తు॥ కుప్పెలు 122 ను, ½ తు॥ కుప్పెలు 22 ను అయినవి. ఆరినపిదప అసలుతూకమునకు 1,2 గురివిందగింజలు హెచ్చుగనే యున్నవి. కుప్పెలు బిగిసికొని గట్టిగ లేవు. వీనిలోనుండి 5, 6 కుప్పెలను తీసి చిన్నప్రమిదలలో వేసి చిన్నపుటముపెట్టితిమి. కుప్పెలు పైన ఎర్రగనున్నవి. బాగుగ లేవు. తూకమునకు చాలవరకు తగ్గినవి. కాని కత్తిరించగా గట్టిగను లోన నల్లగను నున్నవి. ఇదివరలో కుప్పెలను పుటముపెట్టగా బాగుగనుండి ఈసారి బాగుగ నుండకపోవుటచేతను మరియొకవిధముగ చేసిచూడవలెననెడి అభిప్రాయముతోడను మరల, చెప్పబోవువిధమున చేసితిమి. ఈకుప్పెలనన్నిటిని ఒకడాకలో పోసి మూడురంధ్రములుపొడవబడిన యొకమూకుడును పైన బోర్లించి సంధిబంధనముచేసితిమి. ఈ సంపుటమును పొయ్యిమీదపెట్టి 1½ గంట సామాన్యపుమంటను

వేసితిమి. మొదటలో డాకనుండి గబురువాసనగ పొగ వచ్చినది. క్రమముగా ఆ పొగయు వాసనయు తగ్గినవి. పిదప ఆరంధ్రములగుండ పాదరసము పైకివచ్చుచున్నట్లు స్పష్టముగ కనబడినది. ఆరంధ్రము నుండి కడ్డీవేసినను ఆరంధ్రములమీద కుండపెంకునుంచినను పాద రసము ముద్దలుముద్దలుగ పట్టినది. పాదరసముపట్టుట తగ్గగనే దింపి తిమి. చల్లారినపిదప కుప్పెలను తీసి చూడగా ¼తు॥ కుప్పెలు ఏమియు తగ్గలేదు. కాని ½ తు॥ కుప్పెలుమాత్రము 1, 1½ చిన్నము చొప్పున తగ్గినవి. కుప్పెలను ఖల్వములో వేసి కలుబంద మొదలగు రసములతో మర్దించి ¼ తు॥ కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. 129 కుప్పెలైనవి. ఆరినపిదప విశేషించి బాగుగలేకపోవుటచే 30,40 పిడకలతో (మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి) పుటము పెట్టి తిమి. పిదప సరియైనసలుపులో గట్టిగ చాలబాగుగనున్నవి. కత్తిరింప గా వెండిని త్రిక్కుచున్నట్లున్నవి. కుప్పెలు "టం టం"యని మ్రోగు చున్నవి. ¼తు॥కు కొన్ని సరిగను కొన్ని ½ గురివిందగింజ హెచ్చు గను నున్నవి. 129 కుప్పెలున్నవి. కుప్పెలకు వంకరతిరుగుట మొదలగు లక్షణము లేవియు కలుగలేదు. అతీరములు పుటమునకు పూర్వము నందుకంటెకూడ బాగుగ కనబడుచున్నవి.

## సువర్ణకాంతవల్లభరసము.

25-6-28. మహాసువర్ణకాంతవల్లభరస మనెడి పేరుగల యోగముప్రకారము. ఇందు తామ్రభస్మమొదలగునవి అధికముగ కలియుటచే చురుకుగ బాగుగ పనిచేయునని ఈయోగముప్రకారము చేసితిమి. భాగశబ్దముచే తులమును గ్రహించి నాలుగవవంతు వేసి తిమి. అనగా కాంతము 4 తు॥ వంతున. హంసపాదిరసముతో మర్దించి 2 కొండపల్లి కుప్పెలలో పోసి వాలుకాయంత్రమునందు 5½ రోజులు వండితిమి. దింపునప్పటికి కడ్డీకి గంధకపు వాసన ఏమియు లేదు. మరియు కడ్డీకి చిగురున మందు ఎర్రగ పట్టుచున్నది. చల్లారినపిదప కుప్పెను బ్రద్దలుకొట్టగా మందు అడుగున ఎర్రగనున్నది. పైన కొంతసిందూ రముకూడ కలదు. అన్నిటిని కలిపి నీటితో నూరగా కొంతఎరుపు తగ్గి

నది. చాలజిగురుగ నున్నది. ఉజ్జాయింపుగా, కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప గట్టిగ నల్లరాయివలె నున్నవి. కొద్దిగనలుపుకలిసిన ఎరుపులో బాగుగనున్నవి. అన్నివిధముల మందు బాగుగనున్నది. మొత్తము కుప్పెలు 27 తు॥ యున్నవి. తామ్రభస్మను బహువరి శుభ్రమైనదానినే వేసితిమి. అన్నిటితోను కలిసి ఉడుకుటచేతనో లేక మరి ఏయితరకారణముచేతనోకాని కేవలము మందును నాలుక మీద వేసికొనినచో చిమచిమలాడుచు కొద్దిగ ఛర్ది యున్నది.

20-4-29. ఇదివరలో తామ్రభస్మకలిసినదానియందు కొద్దిగ ఛర్దియుండుటచే ఈసారి "సువర్ణకాంతవల్లభరసము" అనెడి పేరుగల యోగముప్రకారమే వేసితిమి. నాలుగవవంతుచొప్పున. కాంతము, 4 తు॥ లు. నిమ్మకాయరసముతో మర్దించి 2 కొండపల్లికుప్పెలలో పోసితిమి. 12-5-29 ఉదయము 9½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 13-5-29 ఉదయము 10 గంటలవరకు ఉడుకుచునేయున్నవి. ఒక కుప్పె ఆరాత్రి (13-5-29) నుండియు చెమర్చుట మానినది. తరువాత మణిశిల వచ్చినది. ఆ తెల్లవారుజామున 3 గంటలనుండియు వెలిగారము వచ్చినది. 14-5-29 ఉదయము కడ్డీకి మందు అంటుకొన ఎర్రగపట్టినది. ఆసాయంత్రము 5 గంటలకు చూచినప్పుడు కొంచెము నలుపురంగుగ నున్నట్లు అనుమానము కలిగినది. అప్పటికి కడ్డీకి గంధకపువాసన వచ్చుచునేయున్నది. రెండవకుప్పె 13-5-29 రాత్రి వరకు చెమర్చుచునేయున్నది. 14-5-29 ఉదయము 11 గంటలనుండియు చెమర్చుట ఆగినది. పిదప మణిశిల వచ్చుచు 15-5-29 ఉదయము 6 గంటలనుండియు వెలిగారము వచ్చుచున్నది. పిదప ఈ రెండుకుప్పెలకునుకూడ వివరములు వ్రాయబడియుండలేదు. కడ్డీకి గంధకపువాసన పూర్తిగపోయి మందు ఎర్రగ పట్టువరకు కొంచెము హెచ్చుతగ్గుగ 6 రోజులు వండినట్లు జ్ఞాపకము, మరియు కుప్పెలు అన్నివిధముల చాల బాగుగనే యున్నవి.

30-1-30. పైయోగముప్రకారమే. కాని 8 వ వంతు అనగా కాంతము 2 తు॥ చొప్పున. ఒకకొండపల్లికుప్పెలో పోసి 8-2-30 ఉద

యము 8½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 4,5రోజులకే గంధకపు వాసనతగ్గి అడుగున ఎర్రగపట్టినది కాని కొద్దిగ అనుమానముగ నుండుటచేనేమోయని 6 రోజులు ఉంచితిమి. అనగా 14-2-30 ఉద యము 8½ గంటలకు మంటవేయుట మానితిమి. పై సిందూరము 6 తు॥ను, క్రిందమందు 10 తు॥లును వెరసి 16 తులములు ఉన్నది. పిదప రెండింటిని కలిపి నీటితో నూరితిమి. చక్కనిరంగులో జిగుగుగ బాగుగనే యున్నది ¼ తు॥కు 1 చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. ఆరినపిదప 1,2 గురివిందగింజలు హెచ్చుగనే యున్నవి. మరియు గట్టిగ కొద్దినలుపుకలిసిన ఎరుపులో బాగుగనే యున్నవి.

6-12-30. పై విధమే. కాంతము 2 తు. కాని కొందరుచెప్పిన వాక్యములనుబట్టి కొన్నికారణములచే నీసారి వ్రాయబోవువిధమున విధానములలో కొద్దిమార్పునుచేసితిమి. రసగంధకములను సామాన్య ముగ కజ్జలిచేసితిమి. కాంతమును, మాండూరమును, కొద్దిపుటములు వేసిన వానిని వేసితిమి. లోహమును కేవలరజనునే వేసితిమి. కలుబంద రసముతో 2,3 రోజులు మర్దించితిమి. ఒకకొండపల్లికుప్పెలో పోసి తిమి. కుప్పెలో పోయినప్పటికి లోహరజను కొద్దిగ గరగరలాడుచు నే యున్నది. 16-12-30 ఉదయము 9½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 20-12-30 ఉదయము చూచునప్పటికి కడ్డీకి అడుగున ఎర్రగపట్టుచున్నది. (దీనిని ఎటులనైనను 5, 6 రోజులు వండవలసి యుండుటచేతను మణిశిలపోవుట మొదలగునవి చాలసార్లు చూచి యుండుటచేతను ఈనాల్గురోజులలో తఱచు కడ్డీలనువేసి చూచియుం డలేదు.) 2-12-30 ఉదయమునుండియు ఆఎరుపుకొద్దిగతగ్గి కొద్దిగ నలుపు కలిసిన ఎరుపులోనున్నట్లు కనబడినది ఇదివరలో ఈస్థితిలోదిం పిన కుప్పెలే గట్టిగ బాగుండుటచేతను, ఆమందునకూడ 5½ రోజులే వండుటచేతను, ఏకారణముచేనైనను గంధకాదులు మిగిలినచో ఈ సారి మందును మూకిటిలోవేయించి చూడవచ్చునని తలచుటచేతను 21-12-30 సాయంకాలము అనగా సరిగ 5½ రోజులకు దింపితిమి. కుప్పెను పగులగొట్టగా 7½ తు॥ సిందూరమును, 10 తు॥ అడుగు

మందును నున్నవి. మందు బాగుగ నేయుచున్నట్లు కనబడినది. కాని అడుగుమందు పైభాగమున కొద్దిగ తెల్లగనున్నట్లు కనబడినది. అందుచే ఈ అడుగుమందును ఒకయినుపమూకిటిలో వేసి సుమారు $\frac{1}{2}$ గంట వేయుంపగా పైనున్నకొద్ది తెలుపును గంధకపువాసన మొదలగునవియు నశించి చక్కని రంగు వచ్చినది. చల్లారినపిదప దీనిని సిందూరమును కలిపి కలుబంతరసముతో 1, 2 రోజులు నూరితిమి. జిగురుగ సరియైన రంగులో బాగుగనున్నది. $\frac{1}{4}$ తులకు ఒకచిన్నము హెచ్చు చేసి కుప్పెలనుగట్టితిమి. 60 కుప్పెలు అయినవి. మందు కొద్దిగ ఖల్వమునకు అంటినది. కుప్పెలు ఆరినపిదప గట్టిగ కొద్ది నలుపుతో కూడిన ఎరుపులో చాలబాగుగనున్నవి. $\frac{1}{4}$ తులకు 1, 2 గురివింద గింజలు హెచ్చుగ నేయున్నవి.

## కాంతవల్లభరసము.

17-1-28. నాలుగవవంతుచొప్పున అనగా కాంతము 4 తులములభాగముచొప్పున. ఒకపెద్దపింగాణీగిన్నెల సంపుటములో పెట్టితిమి. 3-2-28 ఉదయము 8 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 4-2-28 రాత్రి 9 గంటలకు దింపితిమి. మొదట కడ్డీకి కొద్దిగ ముద్దగ అంటుచు క్రమముగ ముద్దగఅంటుటకాని కడ్డీకి బాగుగ చెమర్చుచు క్రమముగ చెమర్చుటకూడ మానినది. అప్పటినుండియు మణిశిల అంటినది. పిదప కొద్దికాలమునకు క్రమముగ తెల్లగ పట్టినది. అప్పుడు ఇంకను 1, 1$\frac{1}{2}$ గంట మంటపెట్టి దింపితిమి. అప్పటికి కడ్డీకి తెల్లగ పట్టుచునే యున్నది. కాని పాదరసము స్పష్టముగ కనబడుట లేదు. సంపుటమును విప్పగా గిన్నెల ప్రక్కభాగములయందు 5 తులముల సిందూరమున్నది. అడుగున 27 తు॥ మందు ఉన్నది. గిన్నె యొక్క పైభాగమునందు 2 తు॥ పిష్టు ఉన్నది. అడుగుమందు కొద్దిగ నల్లగ నున్నది. సిందూరమును ఈమందును కలిపి నూరితిమి. కొద్దిఎరుపులో నల్లగనున్నది. గోమూత్రశిలాజతువు వేసి నూరి కుప్పెలను కట్టితిమి. ఆరినపిదప నల్లగ నున్నవి. మరియు గట్టిగ లేవు. కుప్పెలకు మామూలుగనుండవలసిన లక్షణములు లేకపోవు

టచే, వండునప్పుడు కడ్డీకి వెలిగారము అంటగనే పాకము వచ్చు చున్నదని భ్రమపడి దింపితిమని పూర్తిగ గ్రహించితిమి. తేతపాక మగుటచే ఈకుప్పెలను పరిహరించితిమి.

20-12-28. పైభాగముల చొప్పుననే. 2 కొండపల్లికుప్పెలలో పోసితిమి. ఆరురోజులు పూర్తిగ వండితిమి. రసము సుమారు మూడవనాటికే కనబడి ఆరోజుననే తగ్గినది. తరువాత కడ్డీచివర అసలుమందు ఎర్రగ పట్టుట ప్రారంభించినది. మందుతోకూడిన కడ్డీ చివరను వాసనచూడగా గంధకపువాసన వచ్చుచునే యున్నది. ఏడవనాటికి గంధకపువాసన పూర్తిగ తగ్గినది. వంటకుప్పెలను బ్రద్దలు కొట్టగా అడుగుభాగమున మందు ఎర్రగ నున్నది. పైన 2, 3 తులముల సిందూరమున్నది. మొత్తము సరిగా 27 తు॥ లున్నది. అంతను కలిపి నీటితో నూరగ జిగురుగా కొద్దిఎరుపులో బాగుగనే యున్నది. పిదప కుప్పెలను కట్టితిమి. కొద్దినలుపుకలిసిన ఎరుపులో గట్టిగ బాగుగనే యున్నవి.

28-1-30. పైభాగముల చొప్పుననే వేసి 2 కొండపల్లికుప్పెలలోనే పోసి 8-2-30 ఉదయం $8\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఒకకుప్పె మంటకుగనే పాకమువచ్చుట ప్రారంభించినది. ఆ కుప్పె 15-2-30 ఉదయము $8\frac{1}{2}$ గంటలకు అనగా సరిగా 7 రోజులకు ఎరుపుతగ్గిన నలుపులోనికి అంటుట ప్రారంభించినది. అప్పుడు మంటను తగ్గించితిమి. అప్పటికి 2 వ కుప్పె కొద్దిగ ఎర్రగనే అంటుచున్నది. అందుచే ఆ ఉదయము 11 గంటలవరకు మంటను వేసి ఆర్పితిమి. రెండుకుప్పెలను సరిగ 7 రోజులు వండితిమి. రెండుకుప్పెలలోని మందును తూచగా సిందూరము 9 తు॥ లును అడుగుమందు 19 తు॥ లును వెరశి 28 తు॥ లున్నది. నీళ్ళుపోసినూరగ జిగురుగ బాగుగనే యున్నది. $\frac{1}{4}$ తు॥కు 1 చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప సరిగ $\frac{1}{4}$ తు॥ చొప్పున నున్నవి. మరియు గట్టిగ కొద్దినలుపుకలిసిన ఎరుపులో బాగుగనే యున్నవి.

6-12-30. పై విధముగ నాలుగవవంతుచొప్పుననే వేసితిమి. ఇదివరలో, కొద్దిపుటములు వేసిన లోహములకు వేసితిమి. కొందరు చెప్పిన వాక్యములనుబట్టి ఈసారి క్రిందివిధముగ మార్పుచేసితిమి. పచ్చిలోహములనే వేసితిమి. రసగంధకములను కలిపి 1 రోజును, లోహములను కలిపి కలుబందరసముతో 1 రోజును మర్దించితిమి. 7 రోజులకు సరిగ పక్వముకాకపోయినచో మందును వేయింపవచ్చునవియు ఏది ఎట్లుజరుగునదియు సరిగ పరిశీలింపవచ్చుననియు ఈసారి ఒకకొండపల్లికుప్పెలోనే పోసితిమి. కుప్పెలోపోయునప్పటికి మందు కొద్దిగ గరగరలాడుచునే యున్నది. 16-12-30 ఉదయమున 9½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 21-6-30 సాయంకాలము అనగా సరిగా 5⅓ రోజులకు బాగాపరీక్షచేయగా కడ్డీకి చివరను ఎరుపు బాగుగ అంటుటలేనట్లును అప్పుడే పాదరసము పైకివచ్చుచున్నట్లును అందుచేత ఈమందింకను 2, 3 రోజులువరకు పాకము రానట్లును తలచుటచేతను, ఈ ఒక్కకుప్పెకుమిత్త్రము పొయ్యిలవద్ద నిరీక్షించుచుండవలెనని తలచుటచేతను, ఎంకను వేయుంచి చూడవలెనని మనస్సునందు అభిలాష యుండుటచేతను వెంటనే మంటనుఆర్పి వేడిగ నుండగనే కుప్పెను బ్రద్దలుకొట్టితిమి. సిందూరము సరిగపట్టలేదు. అడుగుమందులో పైసగముకంటు తెల్లతెల్లగా గందరగోళముగ నున్నది. 13 తు॥ లున్నది. మిగిలిన క్రింది సగముమాత్రము మంచి రంగులోనె యున్నది. 12 తు॥ లున్నది. పైభాగమునందలి 13 తు॥ ల మందును ఇనుపమూకుటిలోవేసి సుమారు 1½ గంట వేయింపగా గంధకాదులు వాసనతోకూడ నశించి మందంతయు ఎరుపులోనికి దిగినది. పిదప తూచగా 7½ తు॥ లున్నది. మంచి రంగులోనున్న అడుగుమందునుకూడ సుమారు ½ గంటమాత్రము వేయించితిమి సందేహముపోయి చక్కని ఎరుపులోనికి వచ్చినది. పిదప తూచగా 10½ తు॥ యున్నది. పైసిందూరము 2-3 తులములు మాత్రమేయున్నది. అన్నిటిని కలిపి కలుబందరసముతో 4-5 రోజులు బాగుగ మర్దించితిమి. చాలజిగురుగనే యున్నది. కాని మందు ఇది

వరలోకంటె కొద్ది హెచ్చు ఎరుపులో నున్నది. ఇట్లుండుటకు వేయించుటయే ముఖ్యకారణము. ¼ తు॥కు 1 చిన్నమును, ½ తు॥కు 2చిన్నములను హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. ¼ తు॥ కుప్పెలు 40, ½తు॥ కుప్పెలు 22 అయినవి. ఆరినపిదప తూకమునకు సరిగనున్నవి. గట్టిగ నున్నవి. కాని కొద్దిగ ఎఱ్ఱగమాత్రమున్నవి.

## స్వర్ణవంగము.

**17-1-28.** ఒక్కొక్కటి పదేసితులములచొప్పున. మూతి పొడుగుగనున్న తేజాపకుప్పెలో వండితిమి. 10 తు॥ మందు ఉన్నది. పాకమురాసి మందు పైన కొద్దిగ మిగిలియున్నది.

20-12-28. రెండవయోగము చొప్పున. రసము 7½ తు॥, వంగము 15తు॥, గంధకము 15తు॥, నవాసారము 7½తు॥ గ్రహించి మూతిపొడుగుగనుండు తేజాపకుప్పెలో పోసితిమి. సరిగ 36 గంటలు అనగా 1½ రోజు వండితిమి. కడ్డీకి గంధకపువాసన ఏమియు లేనంత వరకు వండితిమి. చాలబాగున్నది. 12 తు॥ లున్నది. మందుపైన కొంత నల్లగ మిగిలిపోయినది. చక్కనిరంగు వచ్చునేమోయని చూచుటకై 1½ రోజు పూర్తిగ వండుటచే మందు అడుగునుండి కొద్దిగ గట్టిపడి నల్లబడుట ప్రారంభించినది.

1-2-30. పై యోగముప్రకారము. కాని రసము 10తు॥, వంగము 20 తు॥ వంతున. పటికకూడ [పచ్చిదానినే] ఉజ్జాయింపుగ కలిపి వండినచో ఎంతసేపువండినను అడుగునమాడుట మొదలగునవి లేకుండుటయేకాక మందుకూడ చక్కనిరంగులో తయారుకాగల దని, జట్లపాలెంకాపురస్థులు మొఖాసాదార్లు శ్రీ. శ్రీ. మునగాల వెంకయ్యగారు చెప్పిరి. అందుచే ఈమందు మొత్తములో సగమును ఒకకొండపల్లికుప్పెలోనికి ఎక్కించి మిగిలినసగములో 2తు॥ల పటికను వేసి పొడిగనేనూరి దానిని వేరుగ ఇంకొకకుప్పెలో పోసితిమి. ఈరెండుకుప్పెలను 8-2 30 సాయంకాలము 6గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. పటికకలిసినకుప్పె 9-2-30 ఉదయము 10 గంటలకు పక్వము వచ్చినది. మందుపైన కొద్దిగ పిష్టు మిగిలినది. అడుగున సీసాను

అనుకొని పటికచూర్ణము తెల్లగ కొద్దిగ నున్నది. మామూలుస్వర్ణవంగపురంగుకంటె కొద్దిమంచిరంగులో నున్నది. 11 తు॥ లున్నది. పటికవేయని రెండవకుప్పె ఉదయము 8 గంటలకే పాకము వచ్చినది. పైన పిష్టు విశేషించి లేదు. క్రిందిభాగమందలి మందు కొద్దిగ మాడి కొద్దిగట్టిగ కొద్దినల్లగ నున్నది. మిగిలిన 10 తు॥ మందు బాగుగనే యున్నది. కాని పటిక వేసినదానంత బాగుగలేదు.

పటికవేసిన కుప్పెలో 1తు॥ సిందూరము కుప్పెయొక్క పైభాగమునందు పట్టియున్నది.

పటికను ఇంకను హెచ్చువేసినచో ఎట్లుండునో చూడవలయునని తలచి 10-2-30 పైభాగములచొప్పుననే వేసి మొత్తముమందులో 5 తులముల పటికనుకూడ చేర్చి రెండుకొండపల్లికుప్పెలలో పోసితిమి. ఒకకుప్పెను 21-2-30 మధ్యాహ్నము $4\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 22-2-30 రాత్రి 11 గంటలకు దింపితిమి. చాల బాగున్నది. 10 తు॥ లున్నది. అడుగున కొద్దిగ మాడినట్లున్నది. రాత్రి 7,8 గంటలకు కడ్డీవేసినప్పుడు చాల మంచిరంగులో బంగారము మాదిరియున్నట్లు కనబడినది. అప్పుడే దింపినచో మందు ఇంకను బాగుండెడిదేమో! రెండవకుప్పెను 22-2-30 రాత్రి 12 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. అనగా మొదట పెట్టినకుప్పెనుదించినవెంటనె ఆపొయ్యిమీద పెట్టితిమి. 23-2-30 ఉదయము సుమారు 9 గంటలకు దింపితిమి. కడ్డీకిఅంటుట మొదలగు లక్షణములన్నియు నక్రమముగ బాగుగనే యున్నవి. కుప్పెనుబ్రద్దలుకొట్టగా అందు ఏమియు లేదు. తెల్లగా బూడిద యున్నది. ఒకప్రక్కన 1-2 తులములమందు మాత్రము ఉన్నది. మందును కుప్పెలోపోయునప్పుడు ముఖమునొద్ద బ్రద్దలై 1-3 అంగుళముల రంధ్రము పడినది. ఇటులనేపెట్టి చూచినచో ఎట్లుండునో చూడవచ్చునని ఇటులనే పెట్టితిమి. అందుచేతనే మందిట్లు చెడిపోయి యుండవచ్చునని పూర్తిగ అభిప్రాయపడితిమి.

ఒకసారి వండునప్పుడు వంటమధ్యలో కుప్పె పైభాగమునందు బ్రద్దలై అధికముగు పొగ వచ్చినది. అప్పుడు వెంటనే అర్పి

తిమి. ఈమందు బాగుండదనిశీ అభిప్రాయముతో అటులనే 4, 5 రోజులుంచితిమి. మరల నండినచో ఎట్లుండునో చూడవలెనని, దీని పోడిగనే నూరి మరల మంచికుప్పెలోపోసి వండితిమి. మిక్కిలి చక్కగ తయారైనది. వివరములు వ్రాయబడకపోవుటచే [చెనుమందు గదాయని] జ్ఞాపకములేక యింతకంటె వివరించి వ్రాయలేదు.

పటిక వేసివండబడిన మందుయొక్క పైభాగమునందలి పిష్టునందుగాని ఆమందును తక్కువపాకములో దింపి యుందుగాని గంధకమును నవాసారమును కలిపి పోడిగనేనూరి వండినచో మిక్కిలి చక్కగవుష్పించి మంచిరంగులో తయారగునని శ్రీ మునగాల వెంకయ్యగారే చెప్పిరి. అందుచే, 9-4-30 తేదీని పటికవేసి వండబడి పాకముకొద్దిగతక్కువ వచ్చినమందును 4 తు॥ను, గంధకమును 2 తు॥ను, నవాసారమును 2 తు॥ను వేసి ద్రవమును పోయకుండగ పోడిగనే 1, 2 గంటలు నూరి ఒకకుప్పెలో పోసి 9-4-30 మధ్యాహ్నము 3 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 5 గంటలకు దింపితిమి. బంగారము పోదిగినట్లు తళతళ మెరయుచు మిక్కిలిచులకనగ చాల బాగున్నది. 3 తు॥ల మందున్నది.

13-8-30. పై యోగముప్రకారమే. వంగము 20తు॥, రసము 10 తు॥ వంతున. ఈసారి పటికమాత్రము రెట్టింపు అనగా 10 తు॥ వేసితిమి. 2 కొండపల్లికుప్పెలలో పోసితిమి. 19-8-30 సాయంకాలము 6 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మరునాడుదయముచూచునప్పటికి ఒకకుప్పెలోనిమందు మిక్కిలిచక్కగ దిగినది. వెంటనే బ్రద్దలుకొట్టగా మిక్కిలి చక్కనిరంగులో చాలబాగున్నది. రెండవకుప్పె మొదటినుండియు పాకము సరిగ తెలియలేదు. ఒకసారి యొక ప్రక్కన మంచిరంగువచ్చుట యొకసారినల్లగపట్టుట యిట్లు అనేకవిధములుగ కనబడి పాకము సరిగ తెలియలేదు. క్రమముగ బాగున్నట్లు తోచి 20-8-30 తేది 10 గంటలకు ఉజ్జాయింపుగ దింపితిమి. ఇది మొదటికుప్పెకంటెకూడ బాగున్నది. ఒక్కొక్కకుప్పెలో 10 తు॥ చొప్పున మందు ఉన్నది. ఈరెండిటిలోని పైపిష్టు 6 తు॥, గంధకము

3తు॥, నవాసారము 3 తు॥ వీనిని పొడిగనే 1 గంట నూరి ఒకకొండ పల్లికుప్పెలోపోసి 4 గంటలు మంటను వేసితిమి. చివరకు కుప్పెయొక్క మూతి మూయుబోయినది. అప్పుడు కడ్డీవేయగా చక్కనిరంగు కనబడినది. వెంటనే కుప్పెను బద్దలుకొట్టగా మందు చాల బాగున్నది. 1½ తు॥ మాత్రమే యున్నది.

12-2-30. నాలుగువస్తువులు సమభాగములుగకలసిన యోగముప్రకారము పటికనుకూడచేర్చి వండినచో ఇంకను బాగుండునేమో యనియు, ఈసారి లేత పాకములోదించి అసలుమందునందే గంధకమును నవాసారమును కలిపి వండిచూచుదమనియు వ్రాయుబోవువిధముగ చేసితిమి. ఒక్కొక్కదాని 20 తు॥ చొప్పున గ్రహించితిమి. రసమును, వంగమును కలిపి గడ్డగచేసినపిదప ఖల్వములోవేసి నలియగొట్టి కొద్దిగ నీళ్ళుపోసి నూరితిమి. ఆనీళ్ళు నల్లగనైనవి. వానిని తీసివేసి మరల క్రొత్తనీళ్ళుపోసి నూరి నల్లగ నవగనే తీసివేసితిమి. ఇట్లు 4, 5 సార్లు 10, 15 నిముషములు చేయుగా తెల్లగ స్వచ్ఛముగ నున్నది గుడ్డతో మంచునందలి నీటిని శుభ్రముగ వత్తివేసి 20 తు॥ గంధకమునుచేర్చి బాగుగనూరి పిదప 20తు॥ నవాసారమును, 10తు॥ పచ్చిపటికను చేర్చి కలుబందరసముతో 1 రోజు మర్దించితిమి. 2 కొండపల్లికుప్పెలలోపోసి 18-2-30 సాయంకాలము 3½ గంటలకు పొయ్యిమీదపెట్టితిమి. ఆ తెల్లవారుజాము 3½ గంటలకు అనగా మొత్తము 12 గంటలకే రెండుకుప్పెలును ఒకనిముషముకూడ తేడాలేకుండగ మిక్కిలిచక్కనిరంగులో తయారైనవి. మరునాడుదయమున బద్దలుకొట్టగా మందు చాలా మంచిరంగులో నున్నది. కాని పైభాగమునందు పిష్టు చాలమిగిలిపోయినది. పిష్టుతీయబడిన మందు చాలబాగుండుటచేతను, పిష్టు అధికముగ మిగిలి యుండుటచేతను అసలుమందును మరల వండదలచక అట్లనె యుంచితిమి. పిష్టుతీయబడిన మందు మొత్తము 15తు॥ మాత్రమే యున్నది. మొత్తము పిష్టు 20 తు॥ ఉన్నది. ఇందు 10తు॥ గంధకమును, 10 తు॥ నవాసారమునుచేర్చి 1గంట పొడిగనేనూరి యొకకొండపల్లికుప్పెలో పోసి 21-12-30 మధ్యా

హ్నము 1గంటకు పొయ్యిమీద పెట్టితిమి. ఆమూడుగంటలకు ఇంజనులోనుండివలె పొగ ధ్వనితో అధికముగ వచ్చినది. అప్పుడు కడ్డీకి మంచిరంగు అంటినది. 4½ గంటలకు చాల మంచిరంగు అంటుటచే దింపి వెంటనే కుప్పెను బద్దలుకొట్టితిమి. ఉడుకుచు మందుపైన చాల పిష్టు ఉన్నది. అడుగున అర్ధణాకు రెట్టింపుదళసరిలో చాలమంచిరంగులో మిక్కిలి చులకనగ 2½ తు॥ మందు ఉన్నది.

పిష్టునుకాకుండ అసలుమందునే యిట్లు వండినచో చాల బాగుండునట్లుతోచుచున్నది.

14-1-31. నాలుగును సమభాగములు (ఒక్కొక్కటి 20 తులములు). పటిక 10 తులములు. పైవిధముగనేచేసి 2 కొండపల్లికుప్పెలలో పోసి 22-1-31 ఉదయము 11 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. రాత్రి 9 గంటలకు ఒకకుప్పెను, ఆ 12 గంటలకు ఒకకుప్పెను దింపితిమి. 2 కుప్పెలలోని మందుకూడ మొదటినుండియు సరిగ ఉడకక పాకలక్షణములు సరిగ తెలియక అనేకవిధములుగ కనబడినది. అందుచే ఉజ్జాయింపుగ దింపితిమి. మొదటదింపిన కుప్పెకు పైపిష్టు నల్లగ అధికముగ నున్నది. రెండవకుప్పెలో అంతగ లేదు. ఈసారి సరిగ ఉడకక పోవుటకు కారణము తెలియదు. కాని పిష్టుతీసివేసినపిదప అసలు మందు చాల బాగున్నది. ఒక్కొక్కదానిలో 10 తులముల మందు ఉన్నది. రెండింటిలోనిపిష్టు 10 తు॥, గంధకము 5తు॥, నవాసారము 5తు॥ వీనిని ఒకగంట పొడిగ నూరి యొకకొండపల్లికుప్పెలో పోసి 24-1-31 సాయంత్రము 5 గంటలకుపొయ్యిమీద పెట్టితిమి. రాత్రి 9 గంటలకు పాకము వచ్చినది. "కీర్ణం హేమకణైరివ" యనునట్లు తళతళమెఱయుచు చాలబాగున్నది. 4 తులముల మందు ఉన్నది.

రెండవవంటయందు పచ్చతనము కొద్దిగతగ్గినను తళతళ మెఱయుచు చాల బాగుగనున్నది.

కొద్దిగ తాళకమును కలిపినను లేక గంగరాగిపువ్వులరసముతో మర్దించినను మిక్కిలిచక్కనిరంగులోపచ్చగతయారగునని కొందరు చెప్పిరి. మరియు పటికనుచేర్చకుండగనే నాలిగింటిని సమభాగములుగ

గ్రహించి ఒకసీసాయందు పోసి మూతినిమూసి పైన 3,4 సార్లు మట్టిగుడ్డలతో బాగుగచుట్టి చిన్నపుటముపెట్టినచో మిక్కిలి చక్కగ తయారగునని కొందరు చెప్పిరి. ఇట్టివే అనేకవిషయములను వింటిని. వారు తగువివరములను ధైర్యముగ చెప్పకపోవుటచేతను అన్నిటిని చేయుటకు వీలు లేకపోవుటచేతను చేసిచూచి వ్రాయలేకపోతిని.

## వ్యాధిహరణరసము.

25-2-31. బసవరాజీయములో చెప్పబడిన ప్రకారము. 2½ తు॥ రసమును, 2½ తు॥ గంధకమును కజ్జలిచేసి 5 తు॥ల రసకర్పూరమును కలిపి పొడిగనే మర్దించితిమి. కోడిగ్రుడ్లడొల్లలను తెచ్చి ఒక్కొక్క గ్రుడ్డులో సగముచొప్పున 5 గ్రుడ్లలో పోసితిమి. వీనిపై కోడిగ్రుడ్ల డొల్లలనే బోర్లించి [కొంతదిగువరకు] పైన మట్టిగుడ్డలతో 2,3 సార్లు కప్పి(చుట్టి)తిమి. ఒకడాకలో సగముపైగా ఇసుకనుపోసి అందులో ఈగ్రుడ్లను కంఠము వరకు మునుగునట్లు గ్రుచ్చితిమి. అనగా కోడి గ్రుడ్ల పైభాగములు కొద్దిగ కనబడునట్లు ఉంచితిమి. కోడిగ్రుడ్లఅడుగున సుమారు ¾ అంగుళముదళసరిన ఇసుక యుండవచ్చును. డాక పైన ఏమియు బోర్లింపలేదు. 1-3-31 ఉదయము 8 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. సుమారు 11 గంటలకు కోడిగ్రుడ్డునెత్తి మీదనుండి మెల్లగత్రిప్పుచు మూతిసన్నముగనుండు పెద్దసూదిని లోనికి దింపితిమి. ఆసూదిని తీసిచూడగా ఉడుకుచున్నట్లును నల్లగనున్నట్లును కనబడినది. క్రమముగా ఆనలుపుతగ్గి నలుపుతోకూడిన బూడిద వర్ణముగా అంటుట ప్రారంభించినది. క్రమముగా 12 గంటలకు నలుపుతగ్గుచు చక్కని బూడిదవర్ణముగాఅంటుట ప్రారంభించినది. అప్పుడు ఆగ్రుడ్డును మెల్లిగ పైకి తీసితిమి. తీయునప్పటికి కొద్దిగ ఉడుకుచున్నట్లును జిగురుగనున్నట్లును కనబడుచున్నది. మరియు గంధకపువాసన కొద్దిగనున్నది. వెంటనే ఆసంపుటమును [గ్రుడ్డును] మెల్లిగవిప్పితిమి. గ్రుడ్డులో నమంను కొద్దిగ గడ్డకట్టి బరువుగ నున్నది. ఈగడ్డకు చుట్టును, అడుగుభాగమునందును కజ్జలి మిక్కిలి కొద్దిగ నల్లగ స్పష్టముగ కనబడుచున్నది. ఆగడ్డను తీయగనే ఆకజ్జలి కొట్టు

కవతె రాలిపోయినది. అసలు మందు 1 తు॥ యున్నది. దీనిని పరీక్షలన్నియు చేసినవెంటనే రెండవగ్రుడ్డునుకూడ పైవిధముననే బొత్త పొడిచి చూచితిమి. దీనిలోనిమందుకూడ అదేవిధముగ ననగా మొదటిగ్రుడ్డును మొదటిలో చూచినప్పుడున్నట్లుగనేఉన్నది. మొదటిదానియందు కజ్జలికొద్దిగమిగిలియుండుటచే దీనిని ఇంకొకగంటయుంచి సరిగ 12 గంటలకు తీసితిమి. తీయునప్పటికి జిగురుగ పట్టుచునే యున్నది. సూదివేయునప్పుడు గ్రుచ్చుకొనినదేమో. అడుగుభాగమునందు కొద్దిగచిల్లుపడియుండి ఆసంపుటమును తీయునప్పుడు ఆచిల్లునుండి కొద్దిగ పొగ వచ్చినది. దీనిని విప్పిచూడగా మొదటిదానికంటె కొంత తెల్లగనున్నది. విశేషించి గట్టిగ లేదు. చులకనగ నున్నది. కాని గడ్డకట్టి మాత్రమే యున్నది. మందు ¾ తు॥ యున్నది. ప్రక్కలయందు కజ్జలిఏమియు లేదు. కాని అడుగున కొద్దిగ కజ్జలియుండి అడుగున పడిన రంధ్రముగుండ పోయినట్లు తోచుచున్నది. చిల్లుఏమియు పొడవబడని ఒకసంపుటమును ఆ 2 గంటలకుతీసి విప్పి చూచితిమి. మందు గడ్డకట్టి బాగుగనున్నది. బూడిదవర్ణముగ నున్నది. ప్రక్కలయందు కజ్జలి లేదు. కాని అడుగునమాత్రము కొద్దిగనున్నది. మందు 2 తు॥ లున్నది. పిదప వెంటనే మిగిలినరెండుసంపుటలనుకూడ తీసివేసితిమి. వీనికికూడ బొత్తలుపొడవలేదు. దీనివలెనే అనగా మూడవసారితీసినదానివలెనే యున్నవి. ఒక్కొక్కదానిలో రెండేసితులముల మందు ఉన్నది. ఒకప్రక్కన పూర్తిగ పాకము రాక కొద్దిగ నలుపులోనున్న మందు ఈమూడింటిలోను కొద్దిగ కనబడుచున్నది. ముందువెనుకలనుబట్టి హెచ్చుతగ్గులను చెప్పజాలము. కాని యొకదానిలో ఈనలుపు మిక్కిలి కొద్దిగను, ఇంకొకదానిలో ఇంకనుకొద్దిహెచ్చుగను, ఇంకొకదానిలో అంతకంటె కొద్దిహెచ్చుగను [ఒకప్రక్కననే] స్పష్టముగా మిక్కిలి చక్కగ కనబడుచున్నది. మరియు ఆనలుపుయొక్క హెచ్చుతగ్గులనుబట్టి మందుకూడ తూకములో ఒక్కొక్క అణాచొప్పున హెచ్చుతగ్గులుగనే యున్నది. అనగా నలుపుయొక్క హెచ్చునుబట్టి తూకముకూడ మిక్కిలికొద్దిగ హెచ్చుగ నున్నది.

వర్ణము, తూకము మొదలగువానియొక్క సూక్ష్మభేదములనుబట్టి చూచినచో దీనియొక్క పాకముకూడ అతిసూక్ష్మమేయని తోచుచున్నది. గడ్డకట్టిన ఈమందును అతిసూక్ష్మముగా పరిశీలించినచో గడ్డయొక్క అడుగుభాగమునందలి మందు తెల్లగను, మధ్యభాగమునందలి మందు అంతకంటె తక్కువ తెల్లగను, పైభాగమునందు నలుపుతోకూడిన తెల్లగను నుండి రంగులో పొరలుపొరలుగ (స్వర్ణవంగమునకువలె) కనబడుచున్నది. బాగుగ తయారైన మొత్తముమందు 7 తు॥ లున్నది. మొత్తముమందును ఏకముగ కలిపి నూరితిమి. దీని రంగు కొద్దిగ తెలుపుతగ్గిన వంగభస్మ లేక రజతభస్మయొక్క రంగులో నున్నది. సంపుటమును విప్పునప్పటికి కోడిగ్రుడ్డుయొక్క అడుగుడిప్పయు పైడిప్పయు కలిసి ఏకగ్రుడ్డువలె నున్నవి. గ్రుడ్డునకు పైభాగమునందుగాని ఏ ప్రక్కనగాని సిందూరము ఎంతమాత్రము పట్టలేదు.

ఈమందును ఇదివరలో వండియుండకపోవుటచేతను, కొందరియొద్ద మందు ఎర్రగనుండుటయు కొందరియొద్ద మందు తెల్లగనుండుటయు చూచియుండుటచేతను, చాలమంది అనేకవిధములుగ (వంటను గూర్చియు రంగునుగూర్చియు) చెప్పియుండుటచేతను ఈమందు నింత సూక్ష్మపరిశీలనతో వండితిమి. వండిన పిదపకూడ వర్ణముయొక్క నిజానిజములను తెలిసికొనుటకై అనేకమందితో సంప్రదించితిని. వారు నిర్ధారణగ చెప్పలేదు. కాని వారియొక్క మాటలసారాంశమునుబట్టి ఆలోచింపగా యోగమునందు చెప్పినప్రకారము కోడిగ్రుడ్లలోగాక జగ్గంపేటకుప్పెలు మొదలగువానియందు సిందూరపాకముగ వండెదరని గ్రహించితిమి. రసగంధకము లుండుటచే కాచకుప్పెయందు వాలుకాయంత్రమున వండినచో సిందూరౌషధముగ తయారగుటకు ఏమియు అభ్యంతరము లేదు. రసకర్పూరము అడుగున ఏమియు నుండక ఎగిరిపోయి సిందూరముమాత్రము కుప్పెపైభాగమునందు ఉండునని కొందరు చెప్పిరి. ఇందుపాషాణముకూడ కలిపెదరనియు ఇంకను తీవ్రముగ పని చేయుననియు కొందరు చెప్పిరి.

సిందూరప్రధానమగు ఔషధములనువలె దీనినికూడ జగ్గంపేటకుప్పెలు మొదలగువానిలో వండగా సిందూరము చాలబాగుగ తయారైనది.

## పూర్ణచంద్రోదయము.

30-1-28. బంగారము 1తు॥, రసము 8 తు॥, గంధకము 16 తు॥ గ్రహించితిమి. కుందనపుచుట్టలను తెచ్చి విప్పి రసములో కలిపి 2-3 రోజులు బాగుగనూరితిమి. పిదప గంధకమును చేర్చి కజ్జలిచేసి ఎఱ్ఱప్రత్తిపువ్వులరసముతోడను కలబందరసముతోడను మర్దించితిమి. పింగాణీగిన్నెల చిన్నసంపుటములో పోసితిమి. 3-3-28. ఉదయము 8గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 5-3-28 ఉదయము 5గంటలకు పాకము వచ్చినది. మొదటిరోజున తక్కువమంటలను వేయుటచే అడుగుననే ఉడికినది. కాని పైకి తేలలేదు. రెండవరోజున మంటను కొద్దిగ హెచ్చించుటచే పైకి తేలి బాగుగ ఉడికినది. తుదకు సరియైనపాకమే వచ్చినది. పై సిందూరము 8 తు॥, అడుగుబంగారము 2తు॥ ఉన్నది. (గంధకాదులయందలి మాలిన్యము కలసి అడుగుననుండు బంగారము 1½, 2తు॥ ఉండుస్వభావము కలదు.) ఈబంగారము కొద్దినలుపులో కలదు. కడ్డీకి తెలుపుపట్టుట ప్రారంభింపగనే దింపితిమి. అందుచే కొద్దిలేతపాకముగనున్నట్లు కనబడుచున్నది. సిందూరమును బంగారమును కలిపి నూరి పన్నీరుతో మర్దించితిమి. పిదప ఈ అసలుమందునే 6 తు॥ కుప్పెలు కట్టితిమి. మిగిలిన నాలుగుతులములలో, మాఆయుర్వేదౌషధరత్నాకరమునందుచెప్పినవిధమున అనుపానవస్తువులనుచేర్చి పన్నీరుతో మర్దించి ఉజ్జాయింపుగ కొన్నికుప్పెలను కొన్నిమాత్రలనుకట్టితిమి.

పచ్చకర్పూరమును కస్తూరియు హరించి వానియొక్క ఘాటు (బలము) తగ్గుననితలచి, కొంతమందులోనే కలిపితిమి. అవి అయిన పిదప మరల కలుపుచుందుము.

20-7-28. పై విధముగనే చేసితిమి. బంగారముకూడ పైకిఎక్కునని కొందరుచెప్పిన మాటలను నమ్మి చెమ్మతీగయొక్క ఆకులరసముతోకూడ మర్దించితిమి. బంగారము పైకిఎంతమాత్రమును ఎక్కలేదు. పై విధముగనే ఉన్నది. పిదప పై విధముగనే చేసితిమి.

10-5-29. మొదటివిధముగనే చేసితిమి.

20-1-30. మొదటివిధముగనే. ఒకకొండపల్లికుప్పెలోపోసి

21-2-30 ఉదయము $8\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 23-2-30 సాయంకాలము $8\frac{1}{2}$ గంటలకు దింపితిమి. $7\frac{1}{2}$ తు॥ సిందూరమును, $1\frac{1}{2}$తు॥ అడుగుబంగారమును ఉన్నది. సిందూరము మంచి రంగులో రజనుగ చాలబాగున్నది. బంగారమును సిందూరమును కలిపి కాటుకవలెనూరి పొడిగనే జాగ్రత చేసితిమి. దీనినుండి నాలుగు తులములను తీసి పూర్వమందువలెనే అనుపానవస్తువులనుచేర్చి కుప్పెలనుకట్టితిమి. ఈసారి పన్నీరుతోగాక కలుబందరసముతో మర్దించితిమి. $\frac{1}{8}$ తు॥కు $1\frac{1}{4}$చిన్నమును, $\frac{1}{4}$తు॥కు $2\frac{1}{2}$ చిన్నమును హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. $\frac{1}{8}$తు॥కు 24ను, $\frac{1}{4}$తు॥కు॥ 12ను అయినవి. ఆరినపిదప తూచగాసరిగ $\frac{1}{8}$తు॥, $\frac{1}{4}$తు॥ ఉన్నవి మొత్తముకుప్పెలు సరిగ 6 తు॥ ఉన్నవి అనుపానములను చేర్చి కుప్పెలనుకట్టునప్పుడు మూడవవంతు చొప్పున అనగా $\frac{1}{4}$తు॥కు ($7\frac{1}{2}$చిన్నమునకు) $2\frac{1}{2}$చిన్నమును, $\frac{1}{2}$ తు॥కు (15చి॥కు) 5చిన్నములను హెచ్చువేసి కుప్పెలను కట్టినచో ఆరిన పిదప సరిగనుండును.

13-11-30. పై విధముగనే చేసితిమి.

కొందరు గంధకమునింకను అధికముగచేర్చి వండెదరట. అట్టి సాంప్రదాయము మిక్కిలిఅరుదుగ నున్నది.

## షడ్గుణబలిజారితమకరధ్వజము.

20-7-28. కుందనము 1 తు॥, రసము 8 తు॥, గంధకము 16 తు॥ గ్రహించి కలుబందరసముతో మర్దించితిమి. పింగాణిగిన్నెల సంపుటము(ఒకటి)లో పోసి వండితిమి. సిందూరపాకములో కొద్దిలేత లోనే దింపితిమి. పిదప మరల 16 తు॥ గంధకమునుచేర్చి కలుబందరసముతో మర్దించి పింగాణీసంపుటములో వండితిమి. మరల అటులనే వండితిమి.

10-4-29. బంగారము 2తు॥, రసము 16తు॥, గంధకము 32 తు॥ గ్రహించి మర్దించినపిదప దీనిని మూడుభాగములుగచేసి రెండు భాగములను ఒకపింగాణీగిన్నెలపెద్దసంపుటములోను, ఒకభాగమును ఒకకొండపల్లికుప్పెలోను పోసి 12-5-29 ఉదయము $9\frac{1}{2}$ గంటలకు

పొయ్యిమీద పెట్టితిమి. ఆరోజంతయు ఉడుకుచునే యున్నది. 13-5-29 సాయంకాలమువరకు బాగుగచెమర్చుచు ఆరాత్రినుండియు చెమర్చుట క్రమముగతగ్గుచు 14-5-29 రాత్రికి చెమర్చుట చాలతగ్గి ఆ తెల్లవారఝామునకు చెమర్చుట పూర్తిగ తగ్గినది. కాని గంధకపువాసన వేయుచునే యున్నది. మరల వండవలయునుగదాయని అప్పుడే దింపితిమి. పిదప మరల 32 తు॥ గంధకమును చేర్చి కలుబందరసముతో మర్దించి కొండపల్లికుప్పెలలో మూడింటిలో పోసి వండితిమి. మరల 32తు॥ గంధకమును చేర్చి మర్దించి 3 కుప్పెలలోనే పోసి వండితిమి. చక్కగ బాగుగనే ఉన్నది. బంగారమును సిందూరమును కలిపి కాటుకవలె మెత్తగనూరి జాగ్రతచేసితిమి.

12-1-30. పైభాగముల ప్రకారమే (సువర్ణము 2తు॥) వేసి కొండపల్లికుప్పెలలో రెండిటిలో పోసితిమి. 8-2-30 మధ్యాహ్నము 3½ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఒకకుప్పె 9-2-30 తెల్లవారుఝామున 3 గంటలకు చెమర్చుట మానినది. అందుచే నప్పుడు దింపితిమి. వంటమధ్యయందీకుప్పె కొద్దిగ మండినది. అందుచే త్వరలో పాకమువచ్చినట్లు తోచుచున్నది. దీనిని బ్రద్దలుకొట్టగ 7½ తు॥ సిందూరమును, 1½ తు॥ బంగారమును నున్నది. మందుచాలబాగుగనే ఉన్నది. రెండవకుప్పె అదివరలో బాగుగఉడుకుచు 10-2-30 సాయంకాలము మొదలు 11-2-30 రాత్రివరకు కొద్దిగ చెమర్చుచునే యున్నది. ఇట్లుండగా దింపినచో ఎట్లుండునో చూచుదమని ఆరాత్రి 9 గంటలకు (చెమర్చుచుండగనే) దింపితిమి. చల్లారినపిదప బ్రద్దలుకొట్టగ కుప్పె అంతటను ఎర్రఎర్రగ ముద్దలుముద్దలుగ పట్టియున్నది. బంగారము వేరుగ సరిగ కనపడుటలేదు. అడుగున కొంతమందుతో కలసియున్నది. మొత్తమంతయు 20తు॥ ఉన్నది. ఖల్వములో వేసి నూరగ కొంచెము తెల్లతెల్లగను మట్టివలెను ఉన్నది. గంధకమున్నట్లును లేతపాకమైనట్లును స్పష్టముగ కనబడుచున్నది. రెండుకుప్పెలలోని మందును ఖల్వములో వేసి మరల 32తు॥ గంధకమునుచేర్చి మర్దించి కొండపల్లి కుప్పెలలో రెండిటిలో పోసి 21-2-30 ఉదయము 8½గంటలకు పొయ్యి

మీఁద పెట్టి కడ్డీచెమర్చుట మానువరకు వండితిమి. మరల 32తు॥ గం ధకమును చేర్చి పైవిధమే కడ్డీచెమర్చుట మానువరకు వండిదింపితిమి. మందు చాల బాగున్నది. ఒకకుప్పెలో లోననుండి మంట ఎప్పుడో ఒకసారి కొద్దిగ వచ్చుటచే దానిలోని సిందూరము మాత్రము కొద్దిగ తగ్గినది.

1 తు॥ కుందనము, 8 తు॥ రసము, 48 తు॥గంధకము వీనిని కలుబందరసముతో మర్దించి పింగాణీగిన్నెల సంపుటములో పోసి వండితిమి. సరిగ మూఁడురోజులు వండితిమి. కడ్డీచెమర్చుట మానగానే దింపితిమి. చాల బాగున్నది. 8 తు॥ సింధూరమును, 2తు॥ బంగారమును ఉన్నవి. ఏ తేదీః వండితిమో, ఆరురెట్లగంధకమును ఒకేసారి ఎందుకు చేర్చితిమో వివరములు తెలియుటలేదు.

14-11-30.కుందనము 3తు॥, రసము 24తు॥, గంధకము96తు॥ గ్రహించితిమి. ఎందుచేతనోగాని ఈసారి రెండుసారులే వండదలచి ఆరురెట్ల లోను రెండురెట్లను రెండవసారి వేయవచ్చునని మొదట్లో ఏకముగా నాలుగురెట్లను ఒకేసారిగనే చేర్చితిమి. దీనిని పెద్దపింగాణీగిన్నెలసంపుటములలో రెండిటిలో పోసితిమి. 17-12-30 సాయంకాలము 6 గంటలకు పొయ్యిమీఁద పెట్టితిమి. 18-19 తేదీలలో బాగుగనే ఉడికినవి. కాని 19వ తేదీ రాత్రి ఒకసారితక్కువగ చెమర్చుట, ఒకసారి హెచ్చుగ చెమర్చుట ఇట్లున్నది. మంట సరిగతగలకపోవుటయే ఇట్లుండుటకు కారణమని తలచి 20-12-30 ఉదయమునుండియు మంటను సరిగ హెచ్చు వేయించితిమి. అప్పటినుండియు రెండుకుప్పెలును సరిగ ఉడికి ఆరాత్రి 2 గంటలకు ఒకసంపుటము మిక్కిలికొద్దిగను ఇంకొకసంపుటము అంతకంటె కొద్దిగ హెచ్చుగను చెమర్చుచున్నవి. అప్పుడే ఆరెండిటి క్రింద మంటనుకూడ తీసివేసితిమి. మిక్కిలికొద్దిగ చెమర్చిన దానిలో 14 తు॥ సిందూరమును, 2తు॥ బంగారమును ఉన్నవి. రెండవసంపుటములో 16 తు॥ సిందూరమును, $3\frac{1}{2}$ తు॥ బంగారమును ఉన్నవి. మొదటికుప్పెకంటె రెండవకుప్పె యింకను లేతపాకముగ నున్నట్లు

తెలియుచునే యున్నది. లేత పాకముగనున్నను రెండిటిలోని సిందూరముకూడ బాగుగనే ఎఱ్ఱగనే యున్నది. కాని అంతయు మూతియొద్దకు ఎక్కుక ప్రక్కలయందు కొద్దిగపట్టినది. దీనినంతను ఖల్వములో వేసి మిగిలిన రెండురెట్లు (48తు॥)గంధకమును చేర్చి కలబందరసముతో మర్దించి కొండపల్లికుప్పెలలో మూడింటిలో పోసి 22-1-31 ఉదయము 11 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 24-1-31 రాత్రి 2 గంటలకు 2 కుప్పెలును చెమర్చుట మానినవి. వానిని అప్పుడే దింపితిమి. మూడవకుప్పె 25-1-31 మధ్యాహ్నము 3 గంటలకు చెమర్చుట మానినది. దానినప్పుడు దింపితిమి. మూడుకుప్పెలనుకూడ కొద్దిగ వేడిగనుండగనే బద్దలుకొట్టి సిందూరముమీద కొద్దిగనీళ్లు చల్లినట్లు జ్ఞాపకము. మూడుకుప్పెలలోని మొత్తము సిందూరము 24 తులను, బంగారము 5½ తు॥ను ఉన్నది. మందు అంతయు చాలబాగుగనే యున్నది.

సిందూరమును బంగారమును కొంతకాలమటులనే వేరువేరుగ నుంచుకొని పిమ్మట అవసరము కలిగినప్పుడు కలిపి కాటుకవలె ఏకముగ నూరుకొంటిమి.

## సిద్ధమకరధ్వజము.

20-7-28. కుందనము 2 తు॥, రసము 4 తు॥, గంధకము 8తు॥ గ్రహించితిమి. మొదట కుందనమును పాదరసములో బాగుగ నూరి గంధకమునుచేర్చి ఆరసములతో మర్దనలను భావనలను బాగుగ చేసితిమి. చిన్నపింగాణీగిన్నెల సంపుటములో పోసి వండితిమి. చంద్రమారేడు మొదలగువాని కట్టెలను ఏలగునంతవరకు నుపయోగించి క్రమాగ్నులతో వండి లేతపాకముగనే దింపితిమి. పిదప సిందూరమును బంగారమును కలిపి నూరి మరల 8 తు॥ గంధకమును చేర్చి పైవిధముగనే చేసితిమి. సుమారు 4 తు॥ సిందూరమును, 2½ తు॥ బంగారమును ఉన్నది. మందు చాల బాగుగనే తయారైనది. బంగారమును సిందూరమును కలిపి మెత్తగ నూరి జాగ్రతచేసితిమి.

12-5-29. పైవిధముగనే చేసితిమి. కాని రెట్టింపు అనగా బంగారము 4 తు॥, రసము 8 తు॥ వంతున పెట్టితిమి. మరియు మొదట పింగాణీగిన్నెలసంపుటములోను రెండవవంటలో కొండపల్లి కుప్పెలోను వండితిమి.

1-2-30. రసము 4 తు॥ చొప్పున అనగా 20-7-28 వలెనే తయారు చేసితిమి. మొదటివంటకును రెండవవంటకును కూడ కొండపల్లికుప్పెనే యుపయోగించితిమి. సుమారు 4 తు॥ సిందూరమును, 2¾ తు॥ బంగారమును ఉన్నది. వేడిగనుండగనే కుప్పెను బద్దలుకొట్టి నీళ్ళు చల్లితిమి సిందూరము బాగుగనే యున్నది.

6-12-30. పైవిధముగనే చేసితిమి.

దీనిని ప్రతిపర్యాయమునకును సామాన్యముగ మకరధ్వజముతోనే వండితిమి. మకరధ్వజము చాలమందుతయారగునదగుటచే దానికికలుగు అవస్థాభేదములనన్నిటిని విపులముగా వ్రాసితిమి. సిద్ధమకరధ్వజము స్వల్పమగుమందే తయారగునదగుటచేతను మకరధ్వజమునకు వివరముగ వ్రాయుచుండుటచేతను సిద్ధమకరధ్వజమునకు సంగతు లింతకంటె వ్రాయలేదు.

రసకర్పూరభస్మ.

3-1-30. 10తు॥ రసకర్పూరమును మెత్తగనూరి యొకడాకలో పోసి పైనడాకనుబోర్లించి సంధిబంధనముచేసి ఆరనిచ్చి మరునాడు పొయ్యిమీదనుంచి 3 గంటలు సామాన్యపుమంటనువేసితిమి. పిదప విప్పగ తెల్లగ బాగుగనేపట్టినది 6తు॥ ఉన్నది. అడుగునఏమియు లేదు.

ఈసారి 1, 2 గంటలు మాత్రమే మంటనువేసి ఎట్లుండునో చూడవలయును.

20-4-30. 8 తు॥ రసకర్పూరమును పైవిధముగనేచేసి మధ్య మధ్య ఆపుచు 1, 2 గంటలుమాత్రము 4,5 పెద్దమంటలను వేసితిమి. విప్పగా బాగుగనేపట్టి 6 తు॥ ఉన్నది.

21-8-30. 9 తు॥ రసకర్పూరమును పైవిధముగనే చేసి సుమారు ½ గంటమాత్రమే చిన్నమంటను వేసితిమి. పిదప విప్పగా

కొంత పైనను కొంత ప్రక్కలను పట్టినది. అడుగున ఏమియు లేదు. మొత్తము 8తు॥ ఉన్నది. ప్రక్కలనే యెక్కువగ పట్టినది. అది గట్టిగకూడ నున్నది. మొదట కొంత పెద్దమంటను వేసితిమి. ఆ మంట ఒక ప్రక్కకుమాత్రమే తగిలినది. అందుచేతనే మందు విశేషించి ఒక ప్రక్కనబట్టుటయు గట్టిగనుండుటయు తటస్థించినట్లు కనబడుచున్నది. కాన 10తు॥లకును సన్ననిమంటను (దీపమువలె) సంపుటమునకు సరిగ క్రిందుగతగులునట్లు (ప్రక్కలకుపోకుండ) నుమారు అరగంటమాత్రమే వేసినచో మందు అంతయు సరిగ పైకి ఎక్కునని తోచుచున్నది లేక నిప్పులకుంపటిమీద ఉంచి అడుగున విసరినను సరిగ పైకి ఎక్కునని తోచుచున్నది.

## భాండవము లేక రసభస్మ.

27-2-31. విధానములనన్నిటిని చేసిచూడవలెనని కొద్దికొద్దిగ క్రిందివిధమున చేసితిమి. "లలిపంచాంగుల" మొదలగు పద్యముచే చెప్పబడిన విధము. ఆమూడింటియొక్క వేళ్ళపైపొరలను ఒక్కొక్కటితులముచొప్పున మొత్తము 3తు॥ను మెత్తగ నూరి 3 తు॥ పాదరసమునుకూడ చేర్చి కలితో బాగుగ నూరి 2, 3 బిళ్ళలను చేసి ఆరబెట్టితిమి. బిళ్ళలు ఆరినపిదప వెలుతురులో చూడగ పాదరసము అతిసూక్ష్మముగ తెల్లగ కనబడుచున్నది. మొదట వేళ్ళపట్టలను రెండేసి తులములచొప్పున వేసి నూరి సగము వేరుగతీసియుంచి అందులో 3 తు॥ ఇంగిలీకమునుచేర్చి కలితో నూరి 2,3 బిళ్ళలనుచేసి ఆరనిచ్చితిమి. ఈబిళ్ళలుఎఱ్ఱగనే యున్నవి. "పారదముపటికయు" అనుపద్యముచొప్పున రసము 2 తు॥, పచ్చిపటిక 4 తు, సైంధవలవణము 6 తు॥ వీనిని మెత్తగనూరి కలితో మర్దించి 2,3 బిళ్ళలను చేసితిమి. రసమును పటికను మొదట నూరునప్పటికే రసము పటికలో బాగుగ కలిసిపోయెను. ఈబిళ్ళలు గోవర్ణముగ నున్నవి. ఉప్పుకలియుటచే త్వరలో ఆరలేదు. రసమునకుబదులు ఇంగిలీకమును చేర్చి మరల ఇదేవిధముగ బిళ్ళలుచేసితిమి. ఈబిళ్ళలు కొద్దిగ ఎఱ్ఱగనున్నవి. ఈరెండురకముల బిళ్ళలును ఆరినపిదప గట్టిగనైనవి. నాలుగుడాకలను తెచ్చిఒక్కొక్క

దానిలో సుమారు అంగుళమెత్తున ఇసుకనుపోసి నాలుగింటిలోను నాలుగురకముల బిళ్ళలనుఉంచి పైనడాకలను బోర్లించి సంధిబంధనము చేసి ఆరినపిదప 8-3-31 ఉదయము 8 గంటలకు చిత్రమూలాదులను ఇంగిలీకమును కలిసినదియు, పటిక మొదలగునవియు పాదరసమును కలిసినదియు పొయ్యిమీద పెట్టబడినవి. చిన్నమంటవేసితిమి. ఇంగిలీక ముకలిసినదానిని ఆ 12 గంటలకు దింపిచూడగా పైన మందువిమియు పట్టక నల్లగమాత్రము కొద్దిగ పట్టియున్నది. ఒక ప్రక్కనమాత్రము కొద్దిగ పాదరసము ముద్దగపట్టియున్నది. సుమారు $\frac{1}{4}$ తు॥ ఉన్నది. రెండవసంపుటమును మధ్యాహ్నము 2గంటలకు దింపి విప్పితిమి. పైన ముగ్గువలె పట్టినది. సుమారు $\frac{1}{2}$ తు॥ ఉన్నది. ఇది పటికభస్మమో, రసభస్మమో తెలియకున్నది. తెల్లగనే యున్నది. మిగిలిన రెండు సంపుటములను ఆమధ్యాహ్నము రెండుగంటలకు పొయ్యిమీద పెట్టి ఆరుగంటలకుదింపితిమి. చిత్రమూలాదులును రసమును కలిసినది పైన ముగ్గువలె పట్టినట్లున్నది. $\frac{3}{4}$ తు॥ ఉన్నది. తెల్లగ ముగ్గువలెనే యున్నది. కాని సూక్ష్మముగచూడగా అందులో పాదరసము చిన్న చిన్నఉండలుగ ఉన్నట్లు కనబడినది. దానిని ఒకగుడ్డలో వేసి పిండగా రసము ముద్దలుముద్దలుగ వచ్చినది నాలుగవసంపుటమును అనగా పటిక మొదలగునవియు ఇంగిలీకమును కలసిన సంపుటమును విప్పగ పైన ముగ్గువలె తెల్లగ పట్టియున్నది. $\frac{3}{4}$ తు॥ ఉన్నది. ఇది పటికభస్మమో మందో తెలియకున్నది. అన్నిటిలోను అడుగున యున్న బిళ్ళలను బయలు వెడలిన పాదరసమును కలిపి పొడిగనేనూరి ఒకడాకలోపోసి (అడుగున ఉప్పుపోయలేదు) పైన డాకనుబోర్లించి సంధిబంధనము చేసి 3 గంటలకాలము వండి విప్పిచూడగా పైన ముగ్గు వలె తెల్లగ పట్టినది. $\frac{3}{4}$ తు॥ ఉన్నది. మొత్తముమీద చూడగా చిత్రమూలాదులుకలిసిన ప్రక్రియకంటె పటిక మొదలగునవికలిసిన ప్రక్రియలే చాల బాగుగవచ్చునట్లు కనబడుచున్నది. మరియు ఉప్పునుపోయకుండ వండినను మందు పైకి పట్టునట్లు తోచుచున్నది.

పై ప్రక్రియలను మేము శాస్త్రమునకు కొంతవరకు వ్యతిరే

కముగను, ఇష్టమువచ్చినట్లుగను, కొంతతొందరగను చేయుటచేత మేము పైనవ్రాసినవిషయములు సరిగ నిర్ధారణములే అని చెప్ప జాలము. మరల సావకాశముగ చేసిచూడవలయును.

ఈ సందర్భములో ఒకరుచెప్పినప్రక్రియ నిచట నుదహరించు చున్నాడను. ఇంగిలీకమును రసకర్పూరమును సమభాగములుగ గ్రహించి ఏమియు ద్రవము పోయకుండగనే పొడిగ నూరవలయును. ఒక డాకలో సుమారు గుప్పెడు ఉప్పుపోసి అదిమి దానిమీద ఈమందు పొడిని గుండ్రముగ బిళ్ళవలెపోసి పైన డాకనుబోర్లించి సంధిబంధనముచేసి ఆరినపిదప క్రింద దీపాగ్ని పెట్టవలయును. పైడాకమీద కొద్దిగ చల్లతనము చేయవలెను. మందు, పైన ముగ్గువలెపట్టును. నాలుగేసితులములకు అనగా మొత్తము 8 తులములకు రెండుమూడు జాములు మంటనువేయవలయును మొదట ఉప్పును కొద్దిగవేయించి పోయవలయును. లేనిచో మందునువండుసమయమున ఆ ఉప్పుకొద్దిగ చిటచిట పేలును. 8 తు॥ మొత్తమునకు 5, 6 తు॥ మందు దిగును.

మేమింకను చేసిచూడలేదు. కాని 1, 2 గంటలుమాత్రమే మంట చాలునని తోచుచున్నది.

28-12-31. చిటచిటనణించువరకును ఉప్పును వేయించితిమి. మూతివెడల్పుకల ఒకకుండలో, కుండయొక్క మూతిపైభాగమునకు సుమారు 3 అంగుళములు తక్కువగనుండునట్లు ఆఉప్పును పోసితిమి. వేయించి మెత్తగనూరబడిన ఉప్పును కుండలోని ఉప్పునకు పైభాగమున సుమారు ఒక అంగుళము దళసరిగపోసి కొద్దిగగుంటవలె చేసి అందు 8 తులముల పాదరసమునుచల్లి దానికి పైభాగమునందు అట్టి మెత్తనిఉప్పునే సుమారు అరఅంగుళము దళసరిగ చల్లితిమి. కుండపై భాగమునందు కుండను బోర్లించి బాగుగసంధిబంధనముచేసి 2 రోజులు మంటనువేసి విప్పిచూడగా భస్మమై పైకుండకు తెల్లగపట్టియున్నది. 4 తులములు ఉన్నది. ఇంకను వండినచో యెట్లుండునోయని తలచి పై కుండను మరల బోర్లించి సంధిబంధనముచేసి ఒకరోజువండగా 2 తులముల భస్మ వచ్చినది.

తరువాత వండినపుడెల్లను పైవిధముననే చేయుచు వచ్చితిమి.

## సువర్ణ వాత రాక్షసము.

25-6-28. ఒక్కొక్కతులముచొప్పున వేసితిమి. ఆరసములతో మర్దించి మూతిపొడుగుగల తేజాపకుప్పెలో వేసి కడ్డీకి గంధకపువాసన పోవువరకు 24 గంటలు వండితిమి. పైన, సిందూరము ఏమియు పట్ట లేదు. అడుగున మందు 20 తు॥ఉన్నది దానిని మర్దించి కుప్పెలను కట్టితిమి ఆరినపదప నల్లగ గట్టిగ బాగుగానే యున్నవి.

15-5-29. మరల పైవిధముగనే చేసితిమి పైవిధముగనే ఉన్నది. కాని ఈసారి కుప్పెలు బహుకొద్దిఎరుపులో నున్నవి. ఈసారి గుండ్రని జగ్గంపేటకుప్పెలో వండితిమి.

24-3-31. ఒక్కొక్కటి ½ తు॥ చొప్పున వేసి ఆయారసముల తో మర్దనమొదలగువానినిచేసి చిన్నబిళ్ళలుచేసి 10, 15 పిడకలతో పుటము పెట్టితిమి. పిదప 6తు॥ ఉన్నది బిళ్ళలు గట్టిగ నల్లగ నున్నవి. మరల ఆరసములతో మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలు కట్టితిమి. నల్లగ గట్టిగ బాగుగనే ఉన్నవి. మొత్తము 6తు॥ ఉన్నవి.

10-4-31. ఒక్కొక్కతులముచొప్పున వేసితిమి. ఆరసములతో మర్దించితిమి. మూతిపొడుగుగనుండు తేజాపకుప్పెలో (చిన్నదానిలో) పోసి 30-4-31 సాయంకాలము 6 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి కడ్డీవేసి చూడలేదు. మరునాడుదయము చూడగ పొడిగ అంటుచున్నది. కడ్డీ అతిదుర్వాసనగ నున్నది. నేపాళములను వేయుటచే ఇంతదుర్వాసన యున్నట్లు తలచితిమి. ఆఉదయము 8½ గంటలకు రస ముపచ్చుట ప్రారంభించినది. 12 గంటలకు రసము పట్టుట తగ్గినది. వాసన కొద్దిగనున్నది. మధ్యాహ్నము 2గంటలకు మంటను హెచ్చువేసి చూడగా రసము మరల బాగుగపట్టినది. వాసనకూడ మరల హెచ్చి నది. ఆరాత్రి (1-5-31) 9 గంటలకు రస మేమియు పట్టకపోవుటయే కాక కడ్డీకి వాసనకూడ ఏమియు లేదు. మరియు మందు నలుపులోనుండి కొద్దిఎరుపులోనికి మారుచున్నట్లు కనబడినది. అందుచే వెంటనే మంట ఆర్పితిమి. మరునాడు మందును తీయగా 15 తు॥ ఉన్నది. సిందూర

మేమియు లేదు. పిదప ఆరసములతో ఒక్కొక్కరోజు బాగుగమర్దించితిమి. $\frac{1}{4}$ తు॥ కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. 75 అయినవి. ఆరినపిదప నల్లగ గట్టిగ బాగుగ నున్నవి. $\frac{1}{4}$తు॥కు సరిగ నున్నవి.

## సువర్ణభూపతి.

25-6-28. రసము 1 తు॥, తామ్రభస్మ 2 తు॥, మిగిలినవి ఒక్కొక్కతులము. ఇట్లువేసి హంసపాదిరసముతో మర్దించి మూతిపొడుగుగల కుప్పెలో వండితిమి. కడ్డీకి గంధకపువాసనపోవువరకు ఒకరోజు వండితిమి. పిదప 9 తు॥ ఉన్నవి. మరల హంసపాదిరసముతో మర్దించి కుప్పెలు కట్టితిమి ఆరినపిదప నల్లగ గట్టిగ నున్నవి.

18-8-29. పైవిధముగనే తయారుచేసితిమి. కాని ఈసారి కుప్పెలు మిక్కిలి కొద్దిఎరుపులో నున్నవి.

27-4-31. ఒక్కొక్కతులముచొప్పున గ్రహించితిమి. (తామ్రభస్మ 2తు॥) హంసపాదిరసముతో మర్దించితిమి. మూతిపొడగుగ నుండు తేజాపకుప్పెలో (చిన్నదానిలో) పోసితిమి. 1-5-31 రాత్రి $9\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఇంకొకగంట కేమూడగ మందు ఉడుకుచునుండక పొడిగనే యున్నది. ఆరాత్రి పొడిగనే ఉడికినది. 2-5-31 ఉదయము $5\frac{1}{2}$ గంటలకుచూడగా కడ్డీకి వాసన ఏమియు లేదు. రసము ఎప్పుడును పట్టలేదు. కాని మొదటనుండియుకూడ కడ్డీకి ఏదియో తెల్లగపట్టుచున్నది. ఆ $5\frac{1}{2}$ గంటలకే మందు నలుపులోనుండి ఎరుపులోనికి మారుచున్నట్లు కనబడినది. అందుచే మంటను వెంటనే ఆర్పితిమి. (మొత్తము 9 గంటలు వండితిమి.) మంటనుఆర్పిన 10 నిమిషములకు కడ్డీవేసి చూడగా రసము బాగుగ అంటుచున్నది. మరునాడు మందును తీసిచూడగా కొద్దిఎరుపుకలిసిన నలుపులో 6 తు॥ ఉన్నది. హంసపాదిరసముతో మర్దించి $\frac{1}{4}$ తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. 24 అయినవి. ఆరినపిదప గట్టిగ నున్నగ చేతికి అంటకుండ బాగుగనే యున్నవి. విశేషించి నల్లగలేవు. సరిగ $\frac{1}{4}$తు॥ చొప్పున యున్నవి.

## లోహరసాయనము.

17-1-28. రసము 8 తు॥, ఖడ్గలోహము 8 తు॥, గంధకము 16 తు॥ వీనిని రసములతో మర్దించి కొండపల్లికుప్పెలోపోసి 4-2-28 ఉదయము 7 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి 9 గంటలకు పాకము వచ్చినది. సిందూరపాకముగనేదింపితిమి. కడ్డికి రసముఅంటుట ప్రారంభించినపిదప 1, 1½ గంట ఉంచి మంటనువేయుచునే ఉంటిమి. చల్లారినపిదప కుప్పెను బద్దలుకొట్టితిమి. పైన సిందూరము ఏమియు లేదు. అడుగుమందు సుమారు 20 తు॥ ఉన్నది. కొద్దిహెచ్చు ఉండుటకు కారణము తెలియదు. పిదప రసములతో మర్దించి కుప్పెలనుకట్టితిమి ఆరినపిదప కుప్పెలు నల్లరాళ్ళవలె గట్టిగ ఉన్నవి కొద్దిపుటములువేసిన ఖడ్గలోహమును వేసితిమి.

15-5-29. పైవిధముగనే చేసితిమి. కుప్పెలు కట్టినపిదప సరిగ లేవు. అనగా కుప్పెలు గట్టిగను నున్నగను లేకపోవుటయేకాక పొక్కినట్లుగ నున్నవి. కాన ఆకుప్పెలను మూకుళ్ళయందుంచి 50, 60 పిడకలతో పుటముపెట్టితిమి. కొంతవరకు గట్టిపడినవి. పుటమునకు పూర్వము 22 తులములును, పుటముపెట్టినపిదప 18 తులములును ఉన్నవి. పిదపమారి కుప్పెలనుకట్టితిమి. గట్టిగ బాగుగనేయున్నవి.

24-2-31. రసము 3తు॥, లోహము 3తు॥, గంధకము 6తు॥ గ్రహించితిమి. కజ్జలిచేసినపిదప లోహమునుచేర్చి ఆరసములతో మర్దించి చిన్నబిళ్ళలనుచేసి 10-15 పిడకలతో పుటముపెట్టితిమి. పిదప సరిగ 3తు॥ ఉన్నది. దానిని కలుబందరసముతో 1రోజు బాగుగ మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప నల్లగ నున్నగ బాగుగ నున్నవి. మరియు నల్లరాయివలె గట్టిగ నున్నవి.

27-3-31. రసము 8తు॥, లోహము (5, 6 పుటములువేయబడినది) 8తు॥, గంధకము 16తు॥ గ్రహించి కజ్జలిచేసి లోహమును వేసి ఆరసములతో మర్దించితిమి. తేజాపకుప్పెలో (పెద్దదానిలో) పోసితిమి. 30-4-31 సాయంకాలము 6 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. మరునాడు మధ్యాహ్నము 2గంటలవరకు బాగుగఉడుకుచునేయున్నది.

2-5-31 ఉదయము 6 గంటలకు కొద్దిగ చెమర్చుచున్నది. 3-5-31 సాయంకాలము 4 గంటలకు చెమర్చుట పూర్తిగ తగ్గినది. అడుగు మందు పొడిగ గరగరలాడుచున్నది. అప్పుడు మంటను ఆర్పితిమి. సిందూరప్రధానమైన మందు కాకపోయినను మిక్కిలిచక్కగ ఉడికినది. చల్లారినపిదప తీయగా నల్లగ 14 తు॥ ఉన్నది. కుప్పెయొక్క మూతి వద్ద గంధకముతో కూడిన సిందూరమువలె ఏదియో పట్టినది. దానిని తీసివేసితిమి. అడుగుమందును ఆకురసములతో మర్దించి ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి ఆరినపిదప గట్టిగనేయున్నవి. కాని కొద్దిగ తెల్లగ నున్నట్లుండుటచే ఒకకుప్పెముక్కను ఎర్రని నిప్పులమీద వేయగా పొగతో గంధకపువాసనతో పచ్చనిమంటతో ముద్దగ ఉడికినది. అందుచే కుప్పెలన్నిటిని 25,30 పిడకలతో పుటము పెట్టగా నల్లగ మెత్తగ 10తు॥ ఉన్నది. దీనిని త్రిఫలారసముతోడను కలుబందరసముతోడను బాగుగమర్దించి ¼ తు॥ కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలు కట్టితిమి. ఆరినపిదప నల్లగ నున్నగ గట్టిగ నున్నవి. సరిగ ¼ తు॥ ఉన్నవి.

## రసభూపతి.

28-6-28. ఒకొక్కదానిని ఆరేసితు॥చొప్పున వేసి పుస్తకములో చెప్పబడినప్రకారము తయారుచేసితిమి. మూతిపొడుగుగల తేజాపకుప్పెలో వండితిమి. కుప్పెలు కట్టినపిదప నల్లగ గట్టిగ బాగుగనే యున్నవి. అంతకంటె వివరములను వ్రాసియుండకపోవుటచే యింతకుమించి వ్రాయుటకు వీలుకలుగలేదు.

27-1-30. ఒకొక్కదానిని పదేసితు॥చొప్పున వేసితిమి. దీనిని 2 కొండవల్లికుప్పెలలో పోసి 10-2-30ఉదయము 9గంటలకు పొయ్యి మీద పెట్టితిమి. మధ్యాహ్నము 1, 2 గంటలకే రెండుకుప్పెలనుండియుకూడ పాదరసము వచ్చుట ప్రారంభించినది. సిందూర ప్రధానమైన ఔషధము కాకపోవుటచేతను, కడ్డీకిగంధపువాసన యుండుటచేతను ఇంకను అటులనే ఉంచితిమి. 11-2-30 సాయంకాలమువరకు పాదరసము కొద్దిగ వచ్చుచునే యున్నది. అప్పటికి గంధకపువాసన చాల

వరకు తగ్గినది. ఆరాత్రి 9 గంటలకు గంధకపువాసన కొద్దిగఉన్న దియు లేనిదియు సరిగ తెలియకపోవుటచే అప్పుడు మంటవేయుటను మాని అడుగున నిప్పులను అటులనే యుంచితిమి. మరునాడు బ్రద్దలు కొట్టగా కుప్పెఅడుగున 26తు॥ల మందు ఉన్నది. దీనిని మరల హంస పాదిరసముతో మర్దించి కుప్పెకట్టితిమి. $\frac{1}{4}$ తు॥ కు 2 చిన్నములు హెచ్చువేసితిమి. ఆరినపిదప కొద్దిగ గట్టిగ నున్నవి. నల్లగనేయున్నవి. చేతికి కొద్దిగ అంటుచున్నవి కొన్ని కుప్పెలు $\frac{1}{4}$తు॥కు॥ 1,2 గురివింద గింజలు హెచ్చుగనేయున్నవి.

6-12-30. ఒక్కొక్కదానిని అయిదేసితు॥చొప్పున వేసితిమి. లోహముకుమాత్రము కొద్దిపుటములువేయబడినదానినే వేసితిమి. ఈసారి కుప్పెలు బాగుగా గట్టిగయుండునేమో చూచెదమని యిట్లు వేసితిమి. ఒక కొండపల్లికుప్పెలోపోసి 16-12-30 సాయంకాలము 5 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. 17-12-30 ఉదయము $7\frac{1}{2}$ గంట లకు చూడగా పాదరసము వచ్చుట ప్రారంభించినది. కాని గంధకపు వాసన యుండుటచే అటులనేయుంచితిమి. ఇంకొక రెండుగంటలకు [$9\frac{1}{2}$కు] రసము క్రమముగా తగ్గినది. అప్పటికి గంధకపువాసనకూడ పూర్తిగ తగ్గినది. పిదప ఇంకొకగంటకూడయుంచి $10\frac{1}{2}$ గంటలనుండియు మంటవేయుటను మానితిమి. చల్లారినపిదప తూచగా 14తు॥లున్నది. హంసపాదిరసముతో ఒకటిరెండురోజులు మర్దింపగా విశేషించి జిగురుగనున్నట్లు కనబడలేదు. అందుచే కలుబందరసముతో 10, 15 రోజులు బాగుగ మర్దించి $\frac{1}{4}$ తు॥కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పె లను కట్టితిమి. 53 కుప్పెలైనవి. ఆరినపిదప కొద్దిగట్టిగ నల్లగనున్నవి. కాని చేతికి కొద్దిగ అంటుచున్నవి. ఒకగురివిందగింజ హెచ్చుగ నున్నవి. కుప్పెలు విశేషించి గట్టిగ లేకపోవుటచేతను, చేతికి కొద్దిగ అంటుచుండుటచేతను ఎటులనుండునో పరీక్షించుటకై వ్రాయబోవు విధానములను చేసితిమి. 2,3 కుప్పెలను ప్రమిదలలోపెట్టి సంధిబంధ నముచేసి నాలుగయిదుపిడకలలో చిన్నపుటము పెట్టితిమి. కుప్పెలు పైభాగమునందు ఎర్రబడినవి. బాగుగలేవు. మరియుతూకమునకుకూడ

చాలతగ్గినవి. కాన మిలిగినకుప్పెలనన్నిటిని ఒకడాకలో పోసిపైన తిరంధ్రములుపొడవబడిన యొకమూకుడును బోర్లించి సంధిబంధనముచేసి ఆరినపిదప ఒకగంట సన్ననిమంటను వేసితిమి. కుప్పెలు క్రిందనుమీదను కలియుటకై సంపుటమును ఎత్తితిప్పుచుంటిమి. త్రిప్పునపుడు ఆరంధ్రములగుండా వాసనచూడగ గంధకపువాసన మొదలగు వేమియు కనబడలేదు. ఒకగంటయైనపిదప మంటనుమాని చల్లారినపిదప తూచగా ఒక్కొక్కకుప్పెకు 1, 1½ చిన్నముచొప్పున తగ్గినవి. అన్నిటిని ఖల్వములోవేసి గుంటగలగరాకురసముతో 5,6 రోజులుమర్దించి ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. 35 అయినవి. ఆరినపిదప సరిగ ¼తు॥ ఉన్నవి. కాని గట్టితనము కొద్దిగనేయుండి చేతికి కొద్దిగ అంటుచున్నవి. అందుచే వేరువిధముగ చూచుటకై 27-1-30 తేదీని వండిన మందుకుప్పెలను మెత్తగనూరి ఇనపమూకుడులోవేసి చిన్న మంటనుపెట్టుట ప్రారంభించితిమి. మొదట గంధకపువాసన బాగుగ వచ్చి సుమారు ½ గంటకు క్రమముగా తగ్గినది. అప్పటికి మందంతయు కొద్దిగ ఎర్రగనైనది. అప్పుడు దింపి తూచగా 16తు॥లున్నది. ఖల్వములోవేసి నీటితో 2, 3 రోజులు మర్దించగా జిగురుగనేయున్నట్లున్నది. దీనిని ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. 60 కుప్పెలైనవి. ఆరినపిదప 1-2గురివిందగింజలు హెచ్చుగనేయున్నవి. గొద్దిగ ఎర్రగనున్నవి. పశేషించి గట్టిగలేవు. మరియు కుప్పెలు పైకి ఉప్పాలుకుచున్నవి. 6-12-30 తేదీనవండబడి మరల డాక సంపుటములో వండబడి కుప్పెలుకట్టిన మందులోని 3 కుప్పెలను తీసి ప్రమిదలలో ఉంచి సంధిబంధనముచేసి 2,3 పిడకలతో చిన్నపుటము పెట్టితిమి. ఆ కుప్పెలు కత్తిరింపగా పైన ఎర్రగను గట్టిగను ఉన్నవి. కాని లోన నల్లగ నున్నవి. వేయించి కుప్పెలుకట్టి ఉప్పాలుకుచున్నట్లున్న కుప్పెలలో మూడింటిని పైవిధముగనే పుటము పెట్టితిమి. చల్లారినపిదప చేతికి మిక్కిలికొద్దిగ అంటుచున్నవి. ఒకకుప్పెతో ఇంకొక కుప్పెను కొట్టగా గట్టిగా మ్రోగుచు బాగుగనే యున్నవి. సరిగ 1తు॥ చొప్పున యున్నవి. కత్తిరింపగా ఇదివరకుకంటె బాగా గట్టిగ

నున్నవి. అందుచే ఈఅన్ని కుప్పెలను మూఁకుళ్ళయందుంచి సంధిబంధనము చేసి 70, 80 పిడకలతో పుటము పెట్టితిమి. పిదప చూడగా ఏమియు బాగాలేవు. $\frac{1}{4}$ తు॥కు సుమారు 2, 3 గురివిందగింజలు తగ్గినవి. కొట్టిచూడగా గట్టిగనే మ్రోగుచున్నవి. కాని పైన ఎఱ్ఱగను లోన నల్లగను ఉన్నవి. అందుచే అన్నిటిని కలిపినూరి $\frac{1}{4}$ తు॥కు ఒక చిన్నము సొంచ్చువేసి కుప్పెలను కట్టితిమి. ఆఱినపిదప సరిగ $\frac{1}{4}$ తు॥ ఉన్నవి. బాగుగనున్నవి. నల్లగను నున్నగను ఉన్నవి. చేతికి అంటుట లేదు. కత్తిరించగా గట్టిగానున్నవి. అన్నివిధముల చాలబాగున్నట్లె యెంచవచ్చును.

**21-3-31.** ఒక్కొక్కదానిని 3 తు॥ చొప్పున గ్రహించితిమి. హంసపాదిరసముతో మర్దించి చిన్న చిన్నబిళ్ళలుచేసి ఆరనిచ్చి 20 పిడకలతో పుటముపెట్టితిమి. (లోహమును సుమారు 10 పుటములు వేయబడినదానిని వేసితిమి. తామ్రమునుపూర్తిగ పుటములు వేయబడిన దానినే వేసితిమి). పుటమునకు పిదప బిళ్ళలు నల్లగను కొద్దిగగట్టిగను ఉన్నవి. $7\frac{1}{2}$ తు॥ ఉన్నవి. హంసపాదిరసముతో బాగుగ మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప కుప్పెలుగట్టిగ లేవు. అందుచే మరల చిన్నపుటముపెట్టి నూరి ఉజ్జాయింపుగ కుప్పెలనుకట్టితిమి. నల్లగ గట్టిగ బాగుగనేఉన్నవి. మొత్తముకుప్పెలు $6\frac{1}{2}$తు॥ ఉన్నవి.

20-4-31. ఒక్కొక్కదానిని 5తు॥ చొప్పున వేసితిమి. ఈసారి మూతిపొగుగనుండు తేజాపకుప్పెలో పోసి 30-4-31 సాయంకాలము 6 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి కడ్డీవేసి చూడ లేదు. మరునాఁడుదయము చూడగా కడ్డీ పొడిగనే వచ్చుచున్నది. వాసన ఏమియు లేదు. అయినను సాయంకాలమువరకు నుంచదలచితిమి. ఉదయము చూచునప్పటికి రసము కొద్దిగ వచ్చుచున్నది. కాని ఆ $8\frac{1}{2}$ గంటలకు రసము తగ్గినది. ఆ రాత్రి 9 గంటలకు దింపితిమి. అప్పటికి వాసన మొదలైన వేమియు లేవు. మరునాఁడు మందునుతీయగా కొద్దినలుపులోనున్నది. 16 తు॥ ఉన్నది పిదప హంసపాదిరసముతో బాగుగ మర్దించితిమి. మర్దించినకొలదియు నలుపు వచ్చినది. $\frac{1}{4}$ తు॥కు

$1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. 61 కుప్పెలు అయినవి. ఆరినపిదప నల్లగను గట్టిగను నున్నగను తూకమునకు సరిగను నుండి చాల బాగున్నవి.

వాతరాక్షసము.

28-5-28. "మృతంసూత" మిత్యాదియోగము. ఒక్కొక్కదానిని ఆరేసి తు॥ చొప్పున గ్రహించి ఆరసములతో మర్దించి చిన్న చిన్నబిళ్ళలుగ చేసి మూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి చిన్న పుటముపెట్టితిమి. పిదప తూచగా 19 తు॥ ఉన్నది. దీనిని ఆరసములతో మరల మర్దించి ఉజ్జాయింపుగ కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప నల్లగ గట్టిగ నల్లరాయివలె నున్నవి.

10-5-29. పైవిధమే. కాని ఒక్కొక్కదానిని $7^{1}$ తు॥ చొప్పున గ్రహించి తయారుచేసితిమి. మొత్తము మందు 23 తు॥ లున్నది. దీనిని కుప్పెలుగట్టగా ఆరినపిదప కొద్దిగ ఎర్రగనున్నవి. మరియు విశేషించి గట్టిగ లేక చేతికి కొద్దిగ అంటుచున్నవి.

27-1-30. ఒక్కొక్కదానిని ఆరేసి తు॥ చొప్పున వేసితిమి చిన్న పుటముపెట్టినపిదప ఆబిళ్ళలు కొద్దిగ ఎర్రగను మెత్తగను ఉన్నవి. అందుచే మరలనూరి యింకను కొద్దిపెద్దపుటమును పెట్టితిమి. బిళ్ళలు ఇదివరలోకంటె కొద్దిగనలుపెక్కి కొద్దిగగట్టిగ నున్నవి. కాని కుప్పెలనుకట్టగా ఆరినపిదప విశేషించి గట్టిగ లేవు.

28-2-30. పైకుప్పెలు గట్టిగలేకపోవుటచే నేడు మరల మూడేసి తు॥ చొప్పున గ్రహించి చిన్నపుటము పెట్టితిమి. బిళ్ళలు ఇదివరలోకంటె కొద్దిగ నల్లగను గట్టిగను ఉన్నవి. $\frac{1}{4}$ తు॥ కు $1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప సరిగ $\frac{1}{4}$ తు॥ యున్నవి. మొత్తముకుప్పెలు ౯తు॥లు ఉన్నవి. ఈకుప్పెలు ఇదివరలో కంటె గట్టిగనే యున్నవి. కాని కొద్దిగ ఎర్రగ నున్నవి.

10-3-31. పైవిధమే. రసభస్మము గంధకమును కలిపి నూరి మిగిలిన వస్తువులను చేర్చి ఆరసములతో మర్దించితిమి. మర్దించునప్పుడే మందు ఎర్రగకనబడుచున్నది. పిదప చిన్నచిన్నబిళ్ళలుచేసి

10, 15 పిడకలతో పుటము పెట్టితిమి. బిళ్ళలు కొద్దిగ ఎఱ్ఱగనే యున్నవి. పిదప మర్దించి కుప్పెలను కట్టితిమి. కొద్ది ఎఱ్ఱగ నున్నవి. మరియు చాలవరకు గట్టిగ నున్నవి. చేతికి అంటుటలేదు. కుప్పెలు మొత్తము 9 తు॥ లున్నవి.

25-3-31. పైవిధమే. కాని ఒక్కొక్కటి ఆరేసితులములచొప్పున. కుప్పెలు ఆరినపిదప కొద్దిఎరుపులోనే యున్నవి. కాని గట్టిగను నున్నగను చేతికంటకుండగను నుండి చాలబాగున్నవి.

15-4-31. ఒక్కొక్కదానిని ఆరేసితులములచొప్పున గ్రహించి పైవిధముగనే మర్దన మొదలగువాని చేసి మూతిపొడుగుగ నుండు పెద్ద తేజాపకుప్పెలో పోసి 1-5-31 రాత్రి 9 గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రిగాని మరియొకప్పుడుగాని చెమర్పలేదు. మొదటినుండియు కడ్డీకి ఏదియో తెల్లగపట్టుచు వచ్చినది. రసము కాదు రసభస్మమై యుండవచ్చును. మొదటినుండియుకూడ వాసనఏమియు విశేషించి లేదు. 2-5-31 ఉదయము 5½ గంటలకు చూడగా కుప్పెయొక్క మూతియొద్ద గంధకము పచ్చగ అసలు రూపముగ కనబడుచున్నది. ఆ 9 గంటలకు చూడగా గంధకము మొదలైనవి ఏమియు కనబడుటలేదు. మందు కొద్దినలుపులోనికి వచ్చుచున్నట్లు ఉన్నది. మరియు మందు గరగర లాడుచున్నట్లుండి బాగుగనేయున్నట్లు తోచినది. అందుచే అప్పుడు మంటను ఆర్పితిమి. మరునాడు మందును తీయుగా కొద్దిఎరుపులో నున్నది 24 తు॥ ఉన్నది. మరల ఆరసముతో బాగుగ మర్దించి ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. 91 కుప్పె అయినది. ఆరినపిదప చాలవరకు నల్లగను గట్టిగను నున్నగను చేతికంటకుండగను తూకమునకు 1, 2 గురిగింజలు హెచ్చుగను ఉండి చాల బాగున్నవి.

## షడ్గుణము.

28-6-28. రసము 12 తు॥, గంధకము 72 తు॥ గ్రహించి కలబందరసముతో మర్దించి సింగాణీగిన్నెలసంపుటము (ఒకటి) లో మందు వండితిమి.

17-9-28. పైవిధమే రెండురోజులు వండితిమి. $11\frac{1}{4}$ తు॥ సిందూరము ఉన్నది.

9-1-29. రసము 30 తు॥, గంధకము 180 తు॥ చొప్పున పింగాణీసంపుటములలో రెండిటిలో వండితిమి

13-4-29. రసము 24 తు॥, గంధకము 72 తు॥ చొప్పున గ్రహించితిమి మరల వండవలయునని సగముగంధకమునుమాత్రమే చేర్చితిమి కలుబందరసముతో మర్దనను చేసినపిదప సగముమందును ఒకపింగాణీసంపుటములోను మిగిలినసగము మందును రెండుకొండపల్లి కుప్పెలలోను పోసి 12-5-29 ఉదయము $9\frac{1}{2}$ గంటలకు పొయ్యిమీద పెట్టితిమి. ఒకకొండపల్లికుప్పె 13-5-29 తేది ఉదయము 10 గంటలకు పాకమువచ్చినది. ఇంతటి తొందరలో పాకమువచ్చుటకు కారణము తెలియదు. కుప్పెను బ్రద్దలుకొట్టగ 3 తు॥ మందు ఉన్నది. మిగిలిన రెండును 14-5-29 రాత్రి 9 గంటలవరకును చెమర్చుచునేఉండి అప్పటినుండియు చెమర్చుట తగ్గినవి ఆ తెల్లవారుఝామునకు గంధకపువాసన చాలవరకు తగ్గి కొద్దివాసన వేయుచున్నది. మరలవండవలయునుగదాయని అప్పుడు (ఆ తెల్లవారుఝామున) దింపితిమి. మూడింటిలోని సిందూరమును ఏకముగ చేసి ఆసిందూరమునకు మూడురెట్లు గంధకమును మరల చేర్చి కలుబందరసముతో మర్దించి కొండపల్లి కుప్పెలలో మూడింటిలో పోసి 12-6-29 తేదీ ఉదయము పొయ్యి మీద పెట్టితిమి వివరము లింతకంటె వివరించి వ్రాయుటకు వీలు కలుగలేదు.

19-10-29. రసము 24 తు॥, గంధకము 144 తు॥ గ్రహించి కలుబందరసముతో మర్దించితిమి ఇదివరలో వండిన మద్దుణము లు చిన్నచిన్న ముక్కలుగను, కొద్దిరజనుగను వచ్చుచుండెను. కాన మందంతయు ఇసుకవలె సరియైన రజనుగ వచ్చి నూరినచో కుంకుమవలె నుండుటకై కొంతమందిస్నేహితులుచెప్పిన మాటలను విశ్వసించి ఈసారి క్రిందివిధములగు మార్పులతో తయారుచేసితిమి. మొత్తము మందులో 10 తు॥ పచ్చివెలిగారమును కలిపి నూరితిమి. ఈమందును

నాలుగుభాగములుగ చేసి రెండు భాగములను రెండుజగ్గంపేటకుప్పెలలో పోసితిమి రెండుభాగములను ఒకపింగాణీసంపుటములో పోసితిమి. ఒకభాగములో 3తు॥ సీసభస్మను (5,6 పుటములు పడిన దానిని) వేసితిమి. అన్నిటిని సిందూరపాకముగ వండితిమి. పింగాణీసంపుటములో కొంతమందు గిన్నెలప్రక్కలయందు పట్టినది. అది కొద్దిగ గట్టిగ ఉన్నది. అన్నిటిలోని సిందూరము బాగుగనే అనగా ఇదివరలోవలెనే ఉన్నది. కాని విశేషించి మార్పు ఏమియు కలుగ లేదు. ఇసుకవలె సన్నని రజనుగ లేదు.

20-8-30. రసము 20తు॥, గంధకము 80 తు॥ గ్రహించితిమి. తుదకు రెండురెట్లువేసి వండినచో ఎట్లుండునోయని ఈసారి మొదట నాల్గురెట్లగంధకమును వేసితిమి దీనిని పింగాణీసంపుటములలో రెండిటిలో పోసితిమి. సరిగ 48గంటలు వండునప్పటికి కడ్డీ కొద్దిగ చెమర్చుచున్నది. ఇట్టి లేతపాకముగ దింపినచో రజనుగ ఎర్రగ ఉండునేమోయనియు, విషయములను గ్రహింపగలదియు మరల రెండవసారి వండవలసియుండుట చేతను అప్పుడు అనగా కడ్డీ కొద్దిగ చెమర్చుచుండగనే దింపితిమి. ఒకసంపుటములోని మందు బాగుగనే ఉన్నది. ఇదివరలోకంటె రజనుకూడ బాగుగనున్నది. కాని లేతపాకమని స్పష్టముగ తెలియుచున్నది. రెండవసంపుటము అడుగున కొద్దిగ చిల్లిపడి ఉన్నది. అందుచేతనో లేక లేతపాకముగుట చేతనో లేక వేరుకారణముచేతనో మందంతయు పైకి సరిగ ఎక్కక కొంత ప్రక్కలయందు పట్టినది. మందు మొత్తము 20 తు॥ ఉన్నది. మరల 40 తు॥ గంధకమును చేర్చి కలుబందరసముతో మర్దించి కొండపల్లి కుప్పెలలో రెండింటిలో పోసితిమి. రెండురోజులకు ఒకకుప్పెయు, ఇంకొకపూటకు ఇంకొకకుప్పెయు పాకము వచ్చినవి. మొదటికుప్పెను, చెమర్చుటమాని తెల్లగపట్టుట ప్రారంభించిన అరగంటకు దింపితిమి. రెండకుప్పెలను, చెమర్చుటమాని తెల్లగపట్టుట ప్రారంభింపగనే దింపితిమి. రెండుకుప్పెలనుకూడ వేడిగనుండగనే ఇసుకనుండితీసి కొద్దిగ చల్లారగనే బద్దలుకొట్టి సిందూరముకల భాగముమీద (లోన)

కొద్దిగనీళ్లు చల్లితిమి. (వేడిగనుండగనే తీసి బ్రద్దలుకొట్టి సిందూరము తడియునట్లు కొద్దిగ నీళ్ళుచల్లినచో మందు ఎర్రగనుండుటయే కాక సిందూరము విచ్చి ఇసుకవలె త్వరలో పడిపోవునని యొకస్నేహితుడు చెప్పెను. అందుచే నీసారి అట్లుచేసితిమి.) సిందూరమును మరునాడు తీసితిమి. చక్కని రజనుగ రాలేదు. కుంకుమ ఎరుపులో లేదు. కాని ఇదివరలోచేసిన అన్నిసార్లకంటె ఎర్రగను రజనుగను ఉన్నది. చాలబాగున్నట్లుగనే ఎంచవచ్చును. మొత్తము 20 తు॥ మందు ఉన్నది. తెలుపెక్కుట ప్రారంభించిన అరగంటకు దింపిన మొదటి కుప్పెలోనిమందు మిక్కిలి కొద్దిగ ముదరపాకము వచ్చినట్లు ఉన్నది. మూతిదగ్గరమందు కొద్దిగ తగ్గుటయే ఇట్లూహించుటకు కారణము.

6-12-30. రసము 30 తు॥, గంధకము 5 రెట్లు. ఒకరెట్టుమూత్రిమే తుదకు వేసివండినచో ఎట్లుండునో చూచుటకై ఈసారి ఇట్లు చేసితిమి. పింగాణీసంపుటములలో రెండింటిలో పోసి వండితిమి. విషయవిస్తరభీతిచేతను, జ్ఞానజనకములగు విషయము లిదివరలోకంటె విశ్లేషించి లేకపోవుటచేతను ఈసారిజరిగిన విషయములను క్లుప్తముగ వ్రాయుచున్నాడను. లేతపాకముగనుండగనే అనగా కడ్డీకొద్దిగ చెమర్చుచుండగనే దింపితిమి. ఒక్కొక్కదానిలో 16 తు॥ చొప్పున ఉన్నది. పిదప 30తు॥ గంధకమునుచేర్చి కొండపల్లికుప్పెలలో మూడింటిలో పోసి వండితిమి. వేడిగనుండగనేతీసి బ్రద్దలుకొట్టితిమి. సిందూరము మీదనీళ్ళుచల్లుట మొదలగువానిని ఇదివరలోవలెనే చేసితిమి. మందు ఇదివరలోవలెనే చాలబాగుగనున్నది. ఒకవిశేషము—ఈమూడింటిలో ఒకకుప్పెను సగముసగము ఉడుకుచుండగనే 1,1½ రోజునకు పాకము వచ్చుననగాతీసి బ్రిద్దలుకొట్టి చూచితిమి. బ్రద్దలుకొట్టిన 4, 5 నిమిషములవరకు ఉడుకుచునే ఉన్నది. చల్లారినపిదప చూడగా మూతి వద్దను ప్రక్కలయందును లావుగ (దళసరిగ) ఎర్రగపట్టినది. కాని గట్టిగబిగిసికొనిపోయినది. మరియు నూరగ ఎరుపు ఎంతమాత్రము లేక తెల్లగను పచ్చగను నల్లగను మట్టివలెను ఉండి చాలలేతపాకముని

స్పష్టముగ తెలియుచున్నది. దీనియందు తగువిధమగు గంధకమును చేర్చి మర్దించి ఒక కొండపల్లికుప్పెలో పోసి తగుపాకములో దింపితిమి. చాలబాగుగనే ఉన్నది.

మొత్తము ఆరురెట్లుగంధకమునుకూడ చేర్చి వండినచో (ఎన్ని సార్లు వండినను) ఇతరులు అమ్మ్మె షడ్గుణమువలె తళతళమెరయుచు అంతయు చక్కనిరజనులో ఉండదని చాలమంది చెప్పిరి. నిజానిజములు సరిగ తెలియకున్నవి.

20-4-31. రసము 13 తు॥, గంధకము 6 రెట్లు (78 తులములు). కలుబందరసముతో మర్దించితిమి. మొత్తము తూచగ 90 తులములున్నది. 40 తు॥ ను మూతిపొడుగుగనుండు పెద్ద తేజాపకుప్పెలోను, 30 తు॥ను కొండపల్లికుప్పెలోను, 20 తు॥ను పింగాణీసంపుటములోను పోసితిమి. ఇచ్చట పింగాణీసంపుటమనగా లోన ఇనుము గల పింగాణీగిన్నెను అడుగున పెట్టితిమి. మధ్య ఇనుముఉండక అంతయు పింగాణియేఉండునట్టియు దళసరిగ తెల్లగనుండునట్టియు అడుగుభాగమున నిలచియుండుటకై కొద్దిగ తట్టు (అంచు ఉండి జగ్గంపేటకుప్పెవలెనే గుండ్రముగనుండునట్టియు పింగాణీగిన్నెను పైన బోర్లించితిమి. ఈపైగిన్నెకుమధ్యను మొదటలోనే, మూతిపొడుగుగనుండు అద్దపుముక్కతో గుండ్రముగ త్రిప్పుచు అవసరమైనంత రంధ్రమును చేసితిమి. పిదప సంధిబంధనముచేసి పైతట్టు(అంచు)వరకు గుడ్డలు చుట్టితిమి. ఈమూడిటిని 30-4-31 సాయంకాలము పొయ్యిమీద పెట్టితిమి. పింగాణీసంపుటము 2-5-31 రాత్రి 11 గంటలకు చెమర్చుట మానినది. అప్పుడు దానిక్రింద నిప్పులను ఆర్పితిమి. జగ్గంపేటకుప్పె 2-5-31 రాత్రి 2 గంటలకు చెమర్చుట మానినది. అప్పుడానిప్పులను ఆర్పితిమి. మూతిపొడుగుగనుండు తేజాపకుప్పె మొదటినుండియు మిక్కిలిచక్కగఉడుకుచు 3-5-31 సాయంకాలము 6 గంటలకు చెమర్చుట చాలవరకుతగ్గి అప్పటికి మిక్కిలికొద్దిగ చెమర్చుచున్నది. ఇట్లు దింపినచో ఎట్లుండునో చూడవచ్చుననియు కావలసినచో మరల వండవచ్చుననియు అప్పటినుండియు మంటవేయుట మానితిమి. చల్లారిన

పిదప విప్పగా పింగాణీసంపుటములోని మందు చాలబాగావట్టిఉన్నది. మిక్కిలి చక్కసిరంగులో నుండి చాలవరకు రజనుగ నున్నది. మరియు పింగాణీగిన్నె మిక్కిలినున్నగ గుండ్రముగ నుండుటచే సిందూరము మిక్కిలి త్వరలో ఊడివచ్చినది. 3 తులముల సిందూరమున్నది. ఈ సిందూరము మాణిక్యరసమువలె మెరయుచు నున్నది. (సిందూరౌషధములను ఇట్టిపింగాణీగిన్నెలలో వండుట చాలశ్రేష్ఠముగ కనబడుచున్నది) జగ్గంపేటకుప్పెలోని సిందూరము చక్కగవట్టి 5 తులముల సిందూరమున్నది. తేజాపకుప్పెలోనిసిందూరము పైనసరిగపట్టియుండక పైనకొద్దిగను ప్రక్కలయందుకొంతయు పట్టియున్నది. మరియు కొంత మందు నల్లగగడ్డగట్టి అడుగున నున్నది. మొత్తమంతటిని మరల కలుబంధరసముతో మర్దించి మొదటవండిన పింగాణీగిన్నెలయందే (చాల బాగుగ వచ్చినదిగదాయనియు మరల చూచుదమనియు) పోసి 15-5-31 ఉదయము పొయ్యిమీద పెట్టితిమి. ఆరాత్రి 10 గంటలకు కడ్డీచెమర్చుట మానినది. అప్పటినుండియు మంటనుమానితిమి. మరునాడు విప్పగా సిందూరము ఇదివరలోవలెనే మిక్కిలిచక్కగ పట్టి ఉన్నది. కాని సుమారు 7 తులములు ఉండవలసినదానికి 5 తు॥ మాత్రమే ఉన్నది. మరలవండుటచే తగ్గినట్లు తోచుచున్నది.

సిందూరప్రధానములగు ఔషధముల కన్నిటికినికూడ సర్వసామాన్యముగకలుగు విషయములన్నియు వివరముగ తెలియుటకై ఇచ్చుట సంగతుల నన్నిటిని నతివివరముగ వ్రాసితిని.

## లోకనాథము.

26-12-28. గవ్వలభస్మ 12 తు॥ వంతున వేసితిమి. ఆరసములతో మర్దించి చిన్న చిన్నఉండలుగచేసి 15,20 పిడకలతో పుటము పెట్టితిమి. పిదప 30 తు॥ ఉన్నది. 30 తు॥ మిరియాలచూర్ణమును చేర్చి తరువాత చెప్పబడిన ఆరసములతో భావనను మర్దనను చేసితిమి. ఉజ్జాయింపుగ కుప్పెలనుకట్టితిమి. ఆరినపిదప విశేషించి గట్టిగలేక కొద్దిగ చిలకనగ నున్నవి. మరియు కొద్దినలుపులోనే యున్నవి.

21-4-31. గవ్వలభస్మ 6 తు॥ వంతున. పై విధముగనే చేసి పుటము పెట్టితిమి. కుప్పెలు పైకి కొద్దిగఎర్రగనున్నవి. 15 తు॥ ఉన్నవి. 15తు॥ మిరియాల చూర్ణమును చేర్చి ఆరసములతో భావనను మర్దనను చేసితిమి. $\frac{1}{4}$ తు॥కు 3 చిన్నము హెచ్చువేసి కుప్పెలనుకట్టితిమి. ఆరిన పిదప 1,2 గురివిందలు హెచ్చుతగ్గులుగ నున్నవి. కాని కుప్పెలు నల్లగను ఆరినకొలదియు బిగిసికొని గట్టిగను అయి కొంత బరువుగలిగి గట్టిగచాలబాగుగనే యున్నవి.

పంచలోహరసాయనము.

ఆరసములతో మర్దించి కుప్పెలనుకట్టితిమి. $\frac{1}{4}$తు॥కు$1\frac{1}{2}$చిన్నము హెచ్చువేసితిమి. ఆరినపిదప $\frac{1}{4}$తు॥కు సరిగనున్నవి.

మహాలక్ష్మీవిలాసరసము.

ఆరసములతో మర్దనను భావనను చేసి పిదప $\frac{1}{4}$తు॥కు$1\frac{1}{2}$ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టితిమి. పిదప సరిగ $\frac{1}{4}$ తు॥ ఉన్నవి. కాని 4 కుప్పెలను ఏకముగ వేసి తూచగా 1 తులమునకు 1,2 గురివిందగింజలు తక్కువగ నున్నవి. ఈకుప్పెలు కొద్దినలుపుతోకూడిన ఎరుపులో నున్నవి.

వాతగజాంకుశము.

దీనిని నీటితోనే నూరెదము. $\frac{1}{4}$ తు॥కు బేడయెత్తును, $\frac{1}{2}$తు॥కు పావలాఎత్తును హెచ్చువేసి కుప్పెలను కట్టినయెడల ఆరినపిదప అసలు తూకమునకు 4,5 గురివిందగింజలు హెచ్చుగ నుండగలవు.

వాతవిధ్వంసి.

ఆరసములతో మర్దించినపిదప $\frac{1}{4}$ తు॥కు 2,3 చిన్నములు హెచ్చువేసి కుప్పెలను కట్టినచో పిదప సరిగనుండగలవు.

శీతాంశురసము.

మర్దనఅయినపిదప $\frac{1}{4}$ తు॥కు 2,3 చిన్నములు హెచ్చువేసి కుప్పెలను కట్టవలయును.

వైష్ణవీరసము.

దీనిని డోలాయంత్రమందు వండినపిదప చిత్రమూలరసము

తోడనే మర్దించి చిన్నచిన్నకుప్పెలను కట్టవలయును. పెద్దకుప్పెలుగ కట్టినచో బాగుగ మర్దించినను కుప్పెలు కొద్దిగ వంకరగనైన పగల గలవు.

## స్వర్ణమాల్యవసంతము.

¼తు॥కు 2,3 చిన్నములు హెచ్చువేసి కుప్పెలను కట్టవలయును.

## క్రమవృద్ధిమహాలక్ష్మీవిలాసరసము.

దీనికి భాగోత్తరవృద్ధిమహాలక్ష్మీవిలాసరసమనియు, ఏకోత్తర వృద్ధిమహాలక్ష్మీవిలాసరసమనియు కూడ వాడుకలు కలవు. ఇందు వేయబడిన లోహములయొక్క భస్మలు నల్లగనున్నచో మందుకూడ నలుపుతో కూడిన ఎరుపుతనమును కలిగియుండును. లేక ఆలోహ ములయొక్క సిందూరములనే వేసినయెడల కుప్పెలు ఎర్రగనే యుండ గలవు. కుంకుమపువ్వును నీటిలో ఒకరోజు నానవేసి వడగట్టి ఆ రసముతోగాని లేక కషాయముకాచి దానితోగాని మర్దనను భావ నను చేయువలయును. కస్తూరిని నీటియందు ఒకఝాము నానవేసి దానితో మర్దనను భావనను చేయువలయును. ¼ తు॥కు 1½ చిన్నము హెచ్చుచేసి కుప్పెలను కట్టవలయును. మేము బంగారుభస్మను తుల ముగ గ్రహించినచో కస్తూరిని ¼తు॥ గ్రహించెదము. కొందరు కస్తూరినికూడ 1 తు॥ గ్రహించెదరు.

## ప్రదరాంతకరసము.

¼ తు॥కు 1½చిన్నము హెచ్చుచేసి కుప్పెలను కట్టవలయును.

## సువర్ణసూర్యావర్తి.

¼తు॥కు 3 చిన్నములు హెచ్చుచేసి కుప్పెలను కట్టవలయును.

## శ్లేష్మవిధ్వంసిరసము.

¼ తు॥కు 3 చిన్నములు హెచ్చుచేయువలయును.

## వసంతకుసుమాకరము.

కస్తూరితో భావనచేయుటకు కొందరు శుభ్రముగు నున్నని రాతి మీద కస్తూరిని పఱచి దానిమీద తడిగుడ్డను కప్పి కొంతసేపు ఉంచి

ఆగుడ్డనుపిండగావచ్చిన రసము నుపయోగింతురు. కొందరు ½ తు॥ కస్తూరినిగ్రహింతురు. చెరుకుముక్కలు, పిల్లిపీచర, పల్లేరు, బూరగ, నేలగుమ్మడి, నేలతాడి, అరటిదుంప, క్షీరకాకోలి, తెల్లసుగంధిపాల, నల్లసుగంధిపాల, ద్రాక్షపండ్లు, దానిమ్మ, ఖర్జూరపుకాయలు, పెద్దముల్లంగి, చిట్టీత ఇవి నానావేళ్లుగణమని చెప్పబడుననియు, వీనియొక్క రసములతోకూడ మర్దించవలయుననియు కొందరు చెప్పుదురు. కొద్దితడిగనుండగనే ¼తు॥కు 1, 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టవలయును.

## సువర్ణసిందూరభూషణము.

¼ తు॥కు 1½ చిన్నము హెచ్చువేసి కుప్పెలను కట్టవలయును.

## లఘుసూర్యావర్తి.

¼ తు॥కు 2,3చి॥ హెచ్చువేసి కుప్పెలుకట్టినచో బాగుగ ఆరిన పిదపగూడ తూకము నకు సరిగ నుండగలవు. [ఆయుర్వేదౌషధరత్నాకరము ద్వితీయముద్రణము 282 వ పేజీని చూచినచో ఇంకను చాలసంగతులు తెలియగలవు.]

## మంచిముత్యములభస్మ.

10 తు॥ మంచిముత్యములను నిమ్మకాయరసములోవేసి ½గంట యుంచి కడిగితిమి. పిదప జిల్లేడుపాలుపూసి 20,25 పిడకలతో పుటము పెట్టితిమి తీయగా అసలుఆకారముగనే వంకరతిరిగి యున్నవి. నలిపినచో మెత్తగ అగుచున్నవి. నూరి వస్త్రకాళితముచేసి జాగ్రతచేసితిమి. 6 తు॥ ఉన్నది. అనగా 4 తు॥ తగ్గినది. తెల్లగ నున్నది.

## ఇంగిలీకసిందూరము.

15 తు॥ ఇంగిలీకపుచూర్ణమును గుడ్డలో మూటకట్టితిమి. వెల్లుల్లిపాయలను నూరి ముద్దగచేసి చుట్టునుకవచమిచ్చి చిన్నమూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి 15,20 పిడకలతో పుటముపెట్టితిమి. విప్పగా కవచముకాలి నల్లబడియున్నది. లోన సిందూరముకూడ కొద్దిగ నల్లనైనట్లున్నది. కాని నూరగా ఎర్రగ బాగుగనేయున్నది. 15 తు॥లు ఉన్నది.

## సూరేకారభస్మ.

ఒకడాకలో సూరేకారమును పోసి అదిమునుగునట్లు నీరుల్లిపాయల రసమును పోసి సుమారు ½గంట మంటనుపెట్టితిమి. ఆరినపిదప భస్మ తెల్లగ బాగుగనే యున్నది. రసమును హెచ్చుగపోసినచో చాల కాలము ఉడికింపవలసియుండును. అప్పుడు భస్మకు కొద్దిఎరుపుతనము వచ్చును. కొద్దిగ పలచగ నుండగనే దింపినచో చల్లారినపిదప గట్టి పడును. లేదా అప్పుడు కొద్దిగ వెచ్చపెట్టినచో గట్టిగనగును. మంట అధికముగనైనచో చల్లారినపిదప ఇసుకవలె గరగరలాడును. రసముతో ఉడికించునప్పుడు డాకను క్రిందకుదింపుచు కలియద్రిప్పుచుండవలెను. లేనిచో అడుగంటవచ్చును. సన్ననిమంటనువేయవలయును.

## శృంగభస్మ.

దుప్పికొమ్మును సుమారు అంగుళముపొడవుగ ముక్కలు చేయించి సన్నముగ చీల్పించితిమి. తీగదొండాకునూరి ముక్కలకు పూసి పెద్దపుటముపెట్టితిమి. సంపుటమును విప్పగా నల్లగ ముక్కలుగనే యున్నవి. కాని విరిచినచో త్వరలో విరుగుచున్నవి. వానిని చితుకకొట్టి నీళ్ళుపోసి నూరి బిళ్ళలుచేసి పెద్దపుటముపెట్టితిమి. ఆ బిళ్ళలు తెల్లగనేయున్నవి. (వేళ్ళతో నలిపినచో మెత్తగలేక గరగర లాడుచున్నవి. బిళ్ళను విరచినచో లోన నల్లగ నున్నది. కాన అన్నిటిని నీళ్ళుపోసి మెత్తగనూరి మరల పెద్దపుటముపెట్టితిమి. నూరగా తెల్లగా కర్పూరశిలాజతువలెనుండి మృదువుగ నున్నది. మొదట 1¼ వీసె కొమ్మును తెచ్చితిమి. తుదకు భస్మనుతూచగా 75 తు॥ ఉన్నది.

## కుమార్యాసవము.

ఆంధ్రభైషజ్యరత్నావళి (ద్వితీయముద్రణము). యోగము నందుచెప్పినప్రకారము చేసినచో చిక్కగనుండుటయేకాక బూజుగట్టి చెడిపోవునేమోయని వ్రాయబోవువిధమున చేసితిమి. కలుబందనుండి రసమును తీసితిమి. దీనిని ఒకపెద్దకుండలో పోసితిమి. ఈరసము సుమారు 1500 తు॥ ఉండవచ్చును. ఇందు నీళ్ళేమియు పోయలేదు.

బాగుగ పిసికితిమి. అందు 4 వీసెల బెల్లమును, 30 తు॥ ఆరె పువ్వును కలిపితిమి కల్కములను రెండేసిఫలములచొప్పున వేసితిమి. 10-12-30 సంధానముచేసి 14-1-31 తీసి వడగట్టితిమి. విశేషించి చిక్కగను విశేషించి పలచగను గాకుండ కొద్దిపరుపులో బాగుగ నిలువయున్న ఆసవమువలె ఘాటుగ చాలబాగున్నది. 26 పౌ॥ అయినది.

## ఉశీరాసవము.

| | | |
|---|---|---|
| 1. | కల్కద్రవ్యములు (ఒక్కొక్కటి 3 తు॥ చొప్పున) | 63 తు॥ |
| 2. | ద్రాక్షపండ్లు | 60 తు॥ |
| 3. | ఆరెపువ్వు | 38 తు॥ |
| 4. | జలము | 1536 తు॥ |
| 5. | పంచదార | 300 తు॥ |
| 6. | తేనె | 150 తు॥ |

ఒకకుండలో వేసి కలిపి సంధిబంధనముచేసి సరిగ ఒకమాస ముంచి తీసితిమి. చాలబాగున్నది. ½ వీసెసీసాలు 22 (33 పౌనులు) అయినవి.

## చందనాసవము.

| | | |
|---|---|---|
| 1. | కల్కములు [ఒక్కొక్కటి 3 తు చొప్పున] | 66 తు॥ |
| 2. | ఆరెపువ్వు | 48 ,, |
| 3. | ద్రాక్షపండ్లు | 60 ,, |
| 4. | జలము | 1536 ,, |
| 5. | పంచదార | 300 ,, |
| 6. | బెల్లము | 150 ,, |

ఒకకుండలో వేసి కలిపి సంధిబంధనముచేసి సరిగ ఒకమాస ముంచి తీసితిమి. చాలబాగున్నది. ½ వీసె సీసాలు 20 (30 పౌనులు) అయినవి.

## సారిబాద్యాసవము.

1. కల్కమును [ఒక్కొక్కటి 12తు॥చొప్పున] 276 తు॥

| | | |
|---|---|---|
| 2. | జలము | 1536 తు॥ |
| 3. | బెల్లము | 900 తు॥ |
| 4. | ఆరెపువ్వు | 30 తు॥ |
| 5. | ద్రాక్షపండ్లు | 180 తు॥ |

ఒక కుండలో వేసి కలిపి సంధిబంధనము చేసి సరిగ ఒకమాస ముంచి తీసితిమి. చాలబాగున్నది. ½ వీసె సీసాలు 18 (27 పౌనులు) అయినవి.

అందరికిని సరిగ తెలియుటకై మేము చేయువిధానములను రెండు మూడింటిని మార్గదర్శకములుగ ఇందుదహరించితిమి. ఇవి యొకమత ము ప్రకారము తయారుచేయబడినవి. అరిష్టములనుకూడ ఇదేవిధ ముగ తయారుచేయవలెను. దానికి జలమునకు మారుగ కషాయమును పోయవలసియుండును. ఇదియే భేదము.

## అశ్వగంధాదిలేహము

జాపత్రి, ఏలక్కాయలు, కుంకుమపువ్వు మొదలగు సుగంధ ద్రవ్యములనుగాక మిగిలిన వస్తువులను చూర్ణము చేసితిమి. 4 వీసెల పంచదారను పాకముపట్టి అందు ఈచూర్ణమును 1 వీసెడు కలిపి ఆ సుగంధద్రవ్యములను మెత్తగ చూర్ణముచేసి కలిపితిమి. చల్లారిన పిదప తేనెను కలిపితిమి. జిగురుగ బాగున్నది. ఇంకొకసారి గొబ్బి గింజలు మొదలగువానినికూడ వేరుగనుంచుకొని మిగిలిన వస్తువులను చూర్ణముచేసితిమి. జాపత్రి గొబ్బిగింజలు మొదలగువానిని నలియ గొట్టి నీళ్ళుపోసి నూరగా జిగురుగ ముద్దవలె అయి పాకములో త్వరగ కలియలేదు. కాన వీనినికూడ ఏకముగ చూర్ణముచేసికొనుట గాని పొడిగనే నూరుకొని వేసికొనుటగాని చేయువలయును.

## కూష్మాండలేహము.

పైబెరడు మొదలగునవి తీసివేయబడిన బూడిదగుమ్మడికాయ ముక్కలను 2½ వీసెలు గ్రహించితిమి. మూతివెడల్పుగల పాత్రిలో 7, 8 సేర్లనీళ్ళు పోసి మూతికి బట్టకట్టి యందాముక్కలనుపోసి 2, 3 గంటలు ఉడికించితిమి. అప్పటికి ముక్కలు మెత్తబడినవి. మఱునాడు

ఎండలో ఆరబెట్టితిమి. ముక్కలు పెద్దవిగనుండి సరిగ ఆరకపోవుటచే వానిని చిన్నముక్కలుగ తఱిగి మరునాడు కొద్దిగ ఎండబెట్టితిమి. పిదప బొత్తలు పొడచి 8 పలముల నేతిని వేసి వేయించితిమి. ముక్కలు బాగుగ ఉండకపోవుటచే, నేతితో కలిసి ఉడికినవి. కాని దోరగ వేగలేదు. అందుచే నేతిని ఇంకను పోసి దోరగ నగువరకు వేయించితిమి. 2½ వీసెల పటికబెల్లమును చిక్కగ పాకముపట్టి అందు ఈ ముక్కలను కల్కద్రవ్యచూర్ణములను వేసి కలియబెట్టి చల్లారినపిదప 4 పలముల తేనెను కలిపితిమి. బాగుగనే యున్నది. ముక్కలను ఉడికినవెంటనే ఆగుడ్డలోనే గట్టిగ పిండితిమి. 1, 1½ సేరురసము వచ్చినది. ఆ రసమును పోసియే పటికబెల్లమును పాకము బట్టితిమి. అధికమగునేతిని వేసి వేయించినను ముక్కలయందు పచ్చియుండుటచే కొంతకాలమునకు ఈ లేహముపై కొద్దిగ బూజుపట్టుచు వచ్చినది. అందుచే రెండవసారి ముక్కలను మొదటనే చాలచిన్నవిగ తరిగితిమి. ఆవిరిమీద ఉడకబెట్టినపిదప 2 రోజులు బాగుగ ఎండబెట్టితిమి. అప్పుడు వరుగువలె 2, 3 గుప్పిళ్ళుమాత్రమే అయినది. నేతిలో ఎఱ్ఱగ వేయించితిమి. ముక్కలు పిండగా వచ్చిన రసముతో పాకముపట్టి అన్నిటిని కలిపితిమి. మరునాటికి కొద్దిగ పలచగనున్నది. అందుచే మరల వెచ్చబెట్టితిమి. గట్టిగనైనది. చల్లారినపిదప తేనెను కలిపితిమి. బూడిదగుమ్మడికాయ యొక్క వాసన వేయుచు బాగుగనే యున్నది. పిదప బూజుగట్టుట మొదలగున వేవియు కలుగలేదు.

## మదనకామేశ్వరీలేహము.

ఆంధ్రభైషజ్యరత్నావళి ద్వితీయముద్రణము 154 పేజీ. పుస్తకములో చెప్పబడినభాగములకు రెట్టింపుచొప్పున. ఒక్కొక్కతులము వస్తువులను మూడుతులముల చొప్పునను రెండేసితులములు వస్తువులను 6 తులములచొప్పునను వేసి వస్త్రకాళితము చేయగా మొత్తము

85 తు॥ ల చూర్ణము అయినది. అనగా వస్తువును తూకమునకు మూడవ వంతు హెచ్చు వేయగా వస్త్రకాళితము చేసినపిదప అసలుతూకము నకు సరిపోయినది. 2 వీసెల పంచదారను పాకముపట్టితిమి. నల్ల మందును నీటిలో బాగుగ కలిపి ఉంచి, పాకమువచ్చు సమయమునకు 10 నిమిషములముందు అందుపోసి పాకము రాగానే భస్మలను జాజికాయ మొదలగు సుగంధద్రవ్యముల చూర్ణమును కలిపి బాగుగ త్రిప్పి పిదప చూర్ణమును కలిపి కొంత వేడిగనుండగనే నేతినికూడ కలిపితిమి. చల్లారినపిదప తేనెను కలిపితిమి చేతికి అంటకుండగ మృదువుగ చాల బాగున్నది.

## త్రివృల్లేహము.

తెగడ, చమురు లేని పదార్థముకాన కొద్దిగ ముదరపాకమైనచో లేహము పొడిగ విరవిరలాడుచుండును. లేతపాకముగ దించినచో ముద్దగ నుండును. కాని కొద్దిరోజులకే బూజుకట్టును. నెయ్యి మొదలగు వానిని అధికముగపోసినచో బాగుగ నుండును. కాని మందము చేసి విరేచనము సరిగ కానేరదు.

## చంద్రప్రభావటి.

మొదటి 16 వస్తువుల చూర్ణమును 1తు॥ చొప్పునను, తరువాతి 10 వస్తువులచూర్ణమును ¼తు॥ చొప్పునను, లోహభస్మను 2 తు॥ ను, తిప్పసత్తును 4 తు॥ ను, కర్పూరశిలాజతుభస్మను 8తు॥ను, మహిసాక్షి గుగ్గులును 8తు॥ను గ్రహించి వీనిని నీటితో నూరి చిన్నకుంకుడుగింజల వలె మాత్రలను చేసితిమి. మొత్తము మాత్రలు సుమారు 45 తు॥ ఉన్నవి.

## మహాయోగరాజగుగ్గులు.

మొదటిద్రవ్యములను ఒక్కొక్కతులముగ గ్రహించి వస్త్ర కాళితము చేసి తూచగ 15 తు॥ ఉన్నది. 30 తు॥ త్రిఫలాచూర్ణమును,

45 తు॥ గుగ్గులును, భస్మాదులను 12 తు॥ చొప్పునను కలిపి తేనెతో మర్దించి కుంకుడుగింజలకంటె కొద్దిగ చిన్నవిగ మాత్రలను చేసితిమి. మొత్తము మాత్రలు సుమారు 1½ వీసె అయినవి. తులము 1కి సుమారు 5 మా॥ చొప్పున తూగినవి.

## గద్య.

ఇట్లు గోదావరీమండలమండనాయమానకోనసీమాంతర్వర్తిమోడేకుర్రుగ్రామవాసియు, భూసురాగ్రగణ్యుండును, శ్రీపాదోపనామకుండును, కౌశికసగోత్రపవిత్రుండును, వేంకటేశ్వరపౌత్రుండును, సోమయాజిపుత్రుండును, సుబ్బమాంబాగర్భశుక్తిముక్తాయమానుండును, సద్గురుసేవాసమాసాదితసాహితీశబ్దశాస్త్రాయుర్వేదాదివిద్యానిధానుండును, భిషగ్వరాయుర్వేదభూషణాదిబిరుదావళీవిరాజమానుండును, విద్వత్ప్రభుసభాస్థానసన్మాననభ్రాజమానుండును, సకలసజ్జనవిధేయుండును నగు కృష్ణమూర్తిశాస్త్రిచే ప్రణీతంబైన "అనుభవదీపిక" సమాప్తము.



# విషయములు.

1. రజతము సరిగ భస్మకాకపోయినయెడల నాలుకకు తగిలినప్పుడు ఉప్పగనుండి చిమచిమలాడుచు ఛర్దినికలిగించు గుణమును కలిగియుండును. అందుచేతనే రజతభస్మనుగాని రజనునుగాని వేసిన రజతచంద్రోదయముయొక్క కుప్పెలు ఒక్కొక్కప్పుడు ఉప్పురుగుచు విడిపోయినట్లుండును. మరియు రజతభస్మను నూరుఖల్వము అప్పుడప్పుడు చెమర్చుచున్నట్లుకూడ నుండవచ్చును.

2. సింధూరప్రధానమగు ఔషధములకు తయారైన పిదప సిందూరము, మొదటవేసినరసమునకు కొద్దిగ తక్కువగ గాని సరిగ గాని వచ్చును.

3. చక్కగ తయారుకావలయునని మార్పుచేసినకొలదియు కొన్నిమందులు సరిగరావచ్చును. కాని కొన్నిమందులు మొదటికంటె కూడ చెడిపోవచ్చును. ఉదాహరణ—కుప్పెలను పుటమువేయుట మొదలగునవి.

4. మేము మొదటిపర్యాయము చేసిన మందులను కుప్పెలు కట్టునప్పుడు తొందరచే తూచకుండగ ఉజ్జాయింపుగ కట్టితిమి. మీరు కుప్పెలను కట్టునప్పుడు, తుదకువ్రాసిన విషయములనుబట్టి గాని ఏమియు వ్రాయనివానికి ఆమందుతో సమానస్వభావముగల ఇతరమందునుబట్టిగాని ఆయుర్వేదౌషధరత్నాకరమునందలి ఔషధ విషయములలో 19వ పేరానుబట్టిగాని కుప్పెలను కట్టుకొనవలయును.

5. "కడ్డీకి గంధకపువాసనపోవువరకు వండవలయును" "కడ్డీకి గంధకపువాసన తగ్గగనే దింపితిమి" మొదలగు సంగతులను చాల చోటుల వ్రాసితిమి. కాన కడ్డీకి గంధకపువాసననుగురించి వివరముగ వ్రాయుచున్నాము. మందు కడ్డీకి మెత్తగపట్టువరకుగాని కడ్డీ చెమర్చుచుండునంతవరకుగాని గంధక మున్నట్లుగనే భావింపవలయును. చెమర్చుటమానగనే రసము తెల్లగపట్టుట ప్రారంభించును., కాని ఒక్కొక్కప్పుడు చెమర్చుటమానగనే రసము పట్టక కడ్డీ పొడిగ వచ్చు

చుండును. ఇంకను పాకమురావలసియుండుటచే రసము అంటక కడ్డీపొడిగ రావచ్చును. లేక ఒకప్పుడు పాకమువచ్చికూడ కొన్ని కారణములచే కడ్డీకి రసము అంటక కడ్డీ పొడిగనే రావచ్చును. ఇట్టిస్థితిలో పాకమును గుర్తించుట చాలకష్టము. కాన అప్పుడు కుప్పెయందువేసిన కడ్డీని ముక్కు యొద్దనుంచుకొని వాసనచూచినచో నొకవిధమైన గంధకపువాసన తెలియుచుండును. ఆ వాసన క్రమముగ చక్కగ తగ్గుచుండును. తుదకు కడ్డీని వాసనచూడగా వాసన ఏమియు లేక కేవలకడ్డీని వాసన చూచినట్లుగనే యుండును. కాని ఈవాసనను తొలుత నింతసూక్ష్మముగ కనుపెట్టుట కష్టము. అనుభవముగల కొలదియు ఆవాసన యొక్క స్థితిగతులను మిక్కిలిచక్కగ కనిపెట్టగలరు. కాంతవల్లభ రసము, వంగరాజీయము, రజతలోహరసాయనము మొదలగు మందుల యందుకూడ కడ్డీవాసనను ఈవిధముగనే గుర్తింపవలయును. కాని ఈ మందులయందు కడ్డీనివేయునప్పుడు మందులోనికి కడ్డీని పోనిచ్చి తీసినచో కడ్డీతోకూడ కొద్దిగమందు రాగలదు. దానిని వాసనచూచినచో పొడికడ్డీని చూచినదానికంటె నిందు వాసన మిక్కిలి చక్కగ తెలియగలదు. మరియు మందుయొక్క రంగుమొదలగు స్వభావములు కూడ తెలియుచుండును. కడ్డీకి గంధకపువాసన పూర్తిగ పోయినపిదప సరియైనపాకము వచ్చినట్లు ఊహింపవలయును.

6. ఒక్కొక్కప్పుడు మంటమొదలగువానియొక్క భేదముల ననుసరించి మందు ఉడుకుటమాని కడ్డీ పొడిగవచ్చి కొద్దికాలముననే పాకమువచ్చునట్లుండును. కాని మంటను అధికముగచేసి సరిగ వేసినచో మందు మరల ఉడికి సరియైనపాకము వచ్చుటకు 1, 1½ రోజు కూడ పట్టవచ్చును. కాన పాకసమయమున మిక్కిలి జాగ్రత్తగనుండి అనేకవిషయములను ఆలోచింపవలయును.

7. మేము అప్పుడప్పుడు సిందూరముపైన నీళ్లు చల్లుటకు కారణము—మందును సాంగశీతలమైనపిదపనే గ్రహింపవలయును. కాని వేడిగనుండగనే కుప్పెను బ్రద్దలుకొట్టి సిందూరముపైన కొద్దిగ నీటిని చల్లినచో ఆవేడిమీాద తడి తగలగనే చిటచిటలాడి మందు చిట్లి

కుప్పెయొక్క పెంకునుండి త్వరలో విడుటయేగాక చక్కని రజను కూడ బయలువెడలును. లేనిచో ఒక్కొక్కప్పుడు ఈకుప్పెనుండి త్వరలో బయలువెడలకపోవుటయేగాక బిళ్ళలుగ గట్టిపడవచ్చును.

8. తాళకము, మణిశిల, గంధకము, వెలిగారము మొదలగు పోవలసినవస్తువులు కలిసిన కొన్నిమందులను వండినపిదప తూచగా ఒక్కొక్కప్పుడు మొదటవేసిన మొత్తపుతూకమునకు స్వల్పము మాత్రమే తగ్గియుండవచ్చును. అప్పుడు మందునందుపోవలసిన వస్తువు లన్నియు పోలేదనియు, సరిగ పాకము రాలేదనియు అనుకొనుటకు వీలులేదు. ఎందుచేననగా నూరి కుప్పెలుకట్టినపిదప ఆకుప్పెలు సరియైన వర్ణము, బరువు, చేతికి అంటకపోవుట మొదలగు మంచిలక్షణము లను కలిగియే యుండును. కొన్నిలోహములు అగ్నిసంయోగముచే అనగా వంటయందుగాని పుటమునందుగాని అధికపరిమాణముగలవిగ అగునని కొందరు చెప్పిరి. అందుచేగాని వస్తువులన్నియు కలిపి ఉడికి ఏకముగనై అంతకంటె విడిపోకపోవుటచేగాని అట్లు హెచ్చించుటకు కారణముగ కనబడుచున్నది.

9. భావనకరక్కాయ, భావనశొంఠి, భావనజీలకర్ర మొదలగు వానిని భావనచేయునప్పుడు పులుపుతగిలి కిలుమెక్కకుండుటకై పెద్దవియగు మూకుళ్ళయందుగాని మూతివెడల్పుగల కుండలయందు గాని పెద్దవియగు పింగాణీపాత్రలయందుగాని భావనచేయవలయును. మరియు భావనలింకను కొంతవరకు మిగిలియున్నను మధ్యమధ్య బాగుగ ఎండబెట్టుచు భావనలనుచేయుట అనేకవిధముల మంచిది. వీనిని ఆయారసములతో ఉడకబెట్టినచో చాలదినములు భావనలక్కర లేకయే రుచిమొదలగునవి త్వరలో కలుగును. కాని ఈపద్ధతి ఎంతమాత్రమును మంచిదికాదు.

10. మందు ఒకప్పుడు సరిగను ఇంకొకప్పుడు కొద్దిగ తక్కువగను తయారుకావచ్చును. మందు ఖల్వమునుఅంటుకొనుట మొదలగువానియొక్క భేదముల ననుసరించికూడ ఇట్టిభేదములు కలుగుచుండవచ్చును.

11. తరుణార్కము, సింహ ప్రతీపాలనము, సూతికామాత్రలు మొదలగుమందులను పరిశుభ్రమగు నున్నని చిన్నఖల్వములో తయారుచేసికొనవలయును.

12. చాలదినములు తయారుచేయవలసిన భస్మలను గాని గంధకరసాయనము, క్రిమ్యాది, ఆనందభైరవి మొదలగు చాలదిన ములు భావనను మర్దనను చేయదగిన మందులనుగాని కొంతవరకు తయారైనపిదప ఆఖల్వము కావలసివచ్చుట మొదలగు ఏకారణము లచేనైనను అ మందును తయారుచేయుట ఆపవలసివచ్చినచో అది వరకుచేసిన విధానమును, చేయవలసిన విధానమును వ్రాసియుంచు కొని కొంతకాలము ఆగి పిదప ఆమందును మరల పూర్తిగతయారుచేసి కొనవచ్చును. కాని ఏకముగ తయారుచేసికొనుటయే మంచిది.

13. పైత్యాంతకము, క్రవ్యాది, ఆనందభైరవి మొదలగునవి చాలకాలము మెత్తగనుండవలయునన్నచో తడియెక్కువగనుండగనే కుప్పెలుగ చేసికొనిగాని ఏకముగాముద్దగగాని జాగ్రతచేసికొని గాలి మొదలగునవి తగలకుండగ నుంచుకొనవలయును. చాలకాలమువరకు మెత్తగనుండగలవు. కాని బూజుకట్టకుండగ చూచుచుండవలయును.

14. పైత్యాంతకము, ఆనందభైరవి. క్రిమ్యాది మొదలగు మందులను కుప్పెలుగచేసికొని జాగ్రతచేసికొనవచ్చును. లేదా ఏక ముగ ముద్దగనుంచుకొని ఎప్పటికప్పుడు కుప్పెలను చేసికొనుచుండ వచ్చును.

15. పూర్ణచంద్రోయము, మకరధ్వజము, సిద్ధమకరధ్వజము వీనియందలి బంగారము పాకభేదముల ననుసరించి వర్ణము, తూకము మొదలగువానియందు క్రిందివిధముగ నుండును. మందు లేతపాకముగ తయారైనచో అడుగున నున్న బంగారము కొద్దినలుపువర్ణముతోకూడి 1 తు॥ కు 1¾ తు॥ ఉండును. మధ్యమపాకముగ లేక సరియైనపాకముగ నున్నచో బూడిదవర్ణముగగాని గులాబివర్ణముగగాని యుండి 1 తు॥కు 1½తు॥ ఉండును. పూర్తిపాకములేక కొద్దినుదరపాకము వచ్చినచో కొంతవరకు బంగారువర్ణమునుగాని లేక ఎండువరిగడ్డియొక్క వర్ణమును

గాని కలిగియుండి 1తు॥కు 1¼ తు॥ ఉండును. పూర్తిగపాకము వచ్చి నప్పుడుగూడ కొంతహెచ్చుఉండుటకు గంధకాదులయందలి మాలిన్యము కలియుటయే కారణముగ కన్పట్టుచున్నది. పైవిధమగు పాకభేదములచే సిందూరముయొక్క పరిమాణమునందుకూడ కొంతతగ్గుదలలు క్రమముగ కనబడును. (8 తు॥ రసమునకు ¼, ½, 1 తు॥ తగ్గుట మొదలగునవి).

16. వండినపిదప సిందూరమునందలి గంధకము తగ్గి అడుగున నున్న బంగారమునందు గంధకమున్నదని తోచినచో దానిని మూకుడునందుంచి కొద్దిగ వేయించుటగాని నూరి 2, 3 చిన్నపుటములను పెట్టుటగాని చేసినచో గంధకము నశించి సరియైనవర్ణము రాగలదు. వెండిమొదలగువానికికూడ నిట్లే చేయువచ్చును. సిందూరమునందు కొద్దిగ గంధక మున్నదని తోచినచో నీటితో కడిగినగాని కొద్దిగవేయించినగాని ఆగంధకముతగ్గి సరియైన వర్ణము రాగలదని కొందరు చెప్పిరి.

17. నూరినమందునందు తడియెక్కువగనుండి త్వరలో కుప్పెలు కట్టుకొనుటకు వీలుగలేకున్నచో ఆమందుముద్దను ఒకమట్టిమూకుడులో వేసి ఉంచినచో 10, 15 నిమిషములకే ఆ తడి హరించి కొంతవరకు గట్టిపడి త్వరలో కుప్పెలకు రాగలదు. ఆయాభస్మలను పుటమునిమిత్తము బిళ్లలనుచేసికొనునప్పుడుకూడ ఈవిధానమును అనుసరింపవచ్చును.

18. ఇంగిలీకము, రససిందూరము మొదలగునవి కలిసిన మందులను నూరునప్పుడు వీనిని ముందుగ ఆరసములతో బాగుగ పలచనగ నూరి పిదప మిగిలినవస్తువులను కలిపి నూరినచో ఇంగిలీకాదులు సరిగ కలియుటయేగాక చక్కని వర్ణముగూడ రాగలదు.

19. మందుకుప్పెలమీద అక్షరములు సరిగ పడనియెడల మందును కొద్దిగ పలచనచేసి కుప్పెలను కట్టినచో అక్షరములు సరిగ పడగలవు. కాని కుప్పెలు అందముగరావు.

20. కొన్నిమందులయొక్క కుప్పెలు మొదట బాగుగనున్నట్లు

కనబడినను కొంతకాలమునకు వానికి విచ్చిపోవుట మొదలగునవి సంభవింపవచ్చును. కొన్నిటియొక్క కుప్పెలు మొదట చేతికి అంటుచున్నట్లుండి గట్టిగ లేకుండునట్లున్నను కొంతకాలమునకు క్రమముగ గట్టిపడి బాగుగ నుండవచ్చును. చెడినకుప్పెలను మరల నూరి మరల కుప్పెలుగ కట్టవచ్చును.

21. సింధూరము లేతపాకముగాని ముదరపాకముగాని వచ్చినచో మరల కొంతగంధకమును చేర్చి వండినచో సరిగ నుండగలదు.

22. షడ్గుణము, రజతచంద్రోదయము, పూర్ణచంద్రోదయము మొదలగువానిని వంటకుపూర్వమునందు ఆయారసములతో మర్దించిన పిదప మందు కాటుకవలె ఎగిరిపోవుచున్నను 2, 3 రోజులు పొడిగ బాగుగ నూరియే వండవలయును.

23. లోపల ఇనుముగల పింగాణీగిన్నెలలో మందులను వండుట కొన్నివిధముల సౌకర్యమని మేమిదివరకు వ్రాసితిమి. లోన ఇనుము లేకుండనుండు పింగాణీగిన్నెలుకూడ కలవు. వానియందు వండినచో ఇంకను సౌకర్యముగ నుండగలదు. ఈపింగాణీగిన్నెలు లావుగనుండును. కొన్నిటికి పైన పువ్వులుండును. తెల్లగ మిక్కిలి నున్నగ నుండును. క్రిందిభాగమున (అడుగుభాగమున) చిన్నతట్టు (అంచు) ఉండును. ఈగిన్నె అడుగుభాగమున గుండ్రముగా నుండును. కావుననే ఆగిన్నె సరిగ నిల్చుటకై అట్టితట్టు ఉండును. ఇది గుండ్రముగ నుండుటచే 2 గిన్నెలను కలిపినచో సరిగ కాచకుప్పెవలెనే ఉండగలదు. మరియు సంపుటము మూతియొద్ద గుండ్రముగనుండుటచే కాచకుప్పెలయందు వలెనే మందు మిక్కిలి చక్కగ పట్టగలదు. మరియు మిక్కిలి నునుపుగ నుండుటచే మందంతయు ఒకనిమిషములోనే ఊడివచ్చును. లోన ఇనుముగలదానికి ఒక్కొక్కప్పుడు పింగాణీ ముక్కలుముక్కలుగ ఊడిపోవుట, గిన్నె పొడుగుగనుండి పైన గుండ్రముగ లేక అణగియుండుటచే మందు ప్రక్కలయందేపట్టి పైకి సరిగ ఎక్కకపోవుట మొదలగునవి సంభవింపవచ్చును. దీనియందు అట్టి వేమియు కలుగవు. ఈగిన్నెకు అడుగున తట్టు ఉండుటచే గుడ్డలు చుట్టుకొనుట మొదలగువానికి వీలుగ

నుండదని తోచినచో లోన ఇనుముగల పింగాణీగిన్నెను అడుగునను ఈకేవలపుపింగాణీగిన్నెను పైనను పెట్టినచో చాల సౌకర్యముగ నుండ గలదు. ఈపింగాణీగిన్నెకు మేకులు మొదలగువానితో నెత్తిమీద పొడిచి చిల్లువేయుట కష్టము. జారిపోవుటగాని ముక్కలుముక్కలుగ బ్రద్దలగుటగాని సంభవింపవచ్చును. కాన కొనపొడవుగనుండు ఆద్దపు ముక్కతో (కొబ్బరిపెంకును ఉంగరములుగచేయువిధమున) నొక్కి త్రిప్పుచు అవసరమైనంత రంధ్రమును చేయవలయును. పైనున్న గిన్నెకు పైతట్టువరకే గుడ్డలను చుట్టవచ్చును.

24. మాదీఫలరసాయనము, పంచతిక్తపానకము, జంబీరాది పానకము మొదలగు పానకములు అందువేయబడిన బెల్లము లేక పంచదారను బట్టి వీసె 1కి సుమారు 48 ఔన్సులచొప్పున అగును. కాని లేతపాకమైనచో కొద్దిహెచ్చుగను ముదరపాకమైనచో కొద్దిగ తక్కువగను అగును. తైలములుగాని ఘృతములుగాని అదేవిధముగ వీసె 1కి 48 ఔన్సులు కావచ్చును. కాని కల్కాదులను అంటుట మొదలగు కొన్నికారణముల ననుసరించి కొద్దిహెచ్చుగ తగ్గవచ్చును. చూర్ణములు మొత్తపుపరిమాణములో సుమారు మూడవవంతు తగ్గును. లేహములు_వస్తువులయొక్కచూర్ణము, పంచదార లేక బెల్లము, తేనె మొదలగువానియొక్క మొత్తమునకు తగ్గకపోవుటయే కాక కొంత హెచ్చుగనే యుండును. ఆసవారిష్టములు_పోసిననీరు లేక కషాయముయొక్క మొత్తమునకు కొద్దిగ తగ్గును. కజ్జల్యౌషధ ములుగాని బంగారము, వెండి, లోహము, సీసము, వంగము మొద లగు ప్రధానలోహములయొక్క భస్మలు గాని తగ్గనవసరములేదు.

25. తైలములను కాచునప్పుడు, అందువేయబడిన తైలము మంచిరకము కానిచో పొంగి పొయ్యిలోపడి మండును. పిండతైలము మొదలగునవి కొన్ని స్వభావముగనే పొంగి పుండవచ్చును. కాన తైలములను కాచునప్పుడు జాగ్రతగనుండవలయును.

26. పంచదార అధికముగకలియు అవిపత్తికరచూర్ణము, అశ్వ గంధాదిచూర్ణము, మహాద్రాక్షాదిచూర్ణము మొదలగువానియందు

పంచదారను ఎప్పటికప్పుడే కలుపుకొనుట మంచిది. లేనిచో ముద్దకట్టి చెడిపోవవచ్చును. చూర్ణములను గాలి తగలని సీసాలు మొదలగు వానియందు జాగ్రతచేయవలయును. గాలి తగులునట్టి కుండలు మొదలగు వానియందు పోసినచో పురుగులు పట్టవచ్చును.

27. శీతాంశురసము వాతవిధ్వంసి మొదలగు మూలిక లధికముగ కలిసిన కజ్జల్యౌషధములయందు సాయంకాలమున ఆయా రసములను పోసియుంచినచో ఆరాత్రి ఆరసములతో ఊరి చక్కగ భావన అగుటయేగాక మందుకూడ త్వరలో మృదుత్వము నొందును.

28. శీతాంశురసము మొదలగువానికి స్వల్పమర్దననే చేసిన యెడల ఆమందులయొక్క కుప్పెలు విశేషించి గట్టిగను నున్నగను ఉండజాలవు.

29. పచ్చితుంగగడ్డల కషాయమును నేరేడిచెక్క కషాయమును కూడ అభ్రకమును మర్దించుటకు శ్రేష్ఠములుగనే యుండును.

30. రజతలోహరసాయనము, లోహరసాయనము మొదలగు మందులను ఎర్రనినిప్పుమీద వేసినయెడల గంధక మున్నచో అధికముగు పొగ కొద్దిగ పచ్చగ వాసనతోకూడ వచ్చుటయేగాక మందు ముద్దగ ఉడుకుచు పచ్చని కొద్దిమంటకూడ వచ్చును. అట్టివానిని మరల తయారుచేయవలసి యుండును.

31. పాదరసమునందు జరీవెండిని కొద్దికొద్దిగ వేయుచు ముద్దగ నగు వరకు నూరి చిన్నబిళ్ళనుచేసి చిన్నపుటమును పెట్టితిమి. పిమ్మట ఆబిళ్ళ మొదటివలెనే తెల్లగనున్నది. కాని గట్టిగ రాయివలె నున్నది.

32. ఇంగిలీకముతో పుటము వేయబడిన కాంతలోహము కొద్ది నలుపులోనుండును. గంధకముతో పుటము వేయబడినది బాగుగ నలుపెక్కి మరల త్వరలో ఎరుపును పొందజాలదు.

33. సూరేకారమును కలిపి పుటమువేసినచో అభ్రకమునందలి చంద్రిక త్వరలో నశించును. కాని తరువాత ఎన్నిపుటములు వేసినను సరియైనరంగు రాజాలదు. మరియు చంద్రికను అట్లు త్వరలో చంపుట కూడ మంచిదికాదు.

34. ఒకవిషయమును ఒక యోగమునందు స్పష్టముగ జెప్పి అదే స్వభావముగల యింకొకయోగమునందు జెప్పకున్నను ఆవిషయమును బట్టి ఇంకొకయోగమునందు గూడ గ్రహింపవచ్చును. ఉ॥ క్రవ్యాది, సువర్ణక్రవ్యాది — నిమ్మకాయరసము యొక్క పరిమాణము భావనలయొక్క పరిమాణము మొదలగునవి.

35. శాస్త్రమునందు చెప్పిన క్రమమార్గములను మనస్సునందు సరిగనుంచుకొని మంటను సరిగ వేయవలయును. ఒకసారి హెచ్చు వేయుట, రాత్రి మొదలగు సమయములయందు అప్పుడప్పుడు తక్కువగ వేయుట మొదలగునవి సంభవించినయెడల మందు సరిగ ఉడకదు. ఒక ప్రక్కన ఉడికియు ఒకప్రక్కన ఉడకకయు నుండును. త్వరలో పాకము రాదు. మరియు పాకముకూడ సరిగ తెలియదు. కాన మంటను సమానముగ వేయవలయును.

36. తయారైన మందుకుప్పెలనుండి వాడుటకు కొంతముక్క కావలసినచో అడకత్తెరయందు అనగా పోకచెక్కలను కత్తిరించు కత్తెర యందుంచి నొక్కి కత్తిరించవలయును. అట్లు చేయునప్పుడు మనకు కావలసినంతమాత్రమే కత్తిరించవచ్చును. మరియు ఆముక్క ఇటునటుపడకుండ చేతిలోనే పడగలదు. (మేమచ్చటచ్చట "కత్తిరించగ" అని వ్రాసినదాని కిదియే యర్థము.)

## కొందరుచెప్పిన విషయములు.

(క్రిందివిషయములు కొన్ని శాస్త్రసమ్మతములుగ కన్పట్టవు. విషయజ్ఞాననిమిత్తము వ్రాయుచున్నాము.)

1. అభ్రకము,లోహము, కాంతము, వంగము మొదలగువానిని 1,2 పుటములు పెట్టినపిదప ఆయారసములతో 5,6 రోజులు ఉడికించి. పిదప మామూలుగపుటములు వేసినచో త్వరలోభస్మమగునని చెప్పిరి

2. కాంతము, లోహము, మాండూరము, అభ్రకము వీనిని బాగుగ వేయించుచు మధ్యమధ్య ఆయారసములను పోయుచుండవల

యును. ఇట్లు 2, 3 రోజులు వేయించినచో విశేషించి పుటములు అక్కరలేకయే త్వరలో భస్మయగునని చెప్పిరి.

3. తామ్రము, లోహములు, రజతము మొదలగునవి గంధక సంయోగముతోవలెనే మాక్షికసంయోగముతోగూడ త్వరలో చచ్చును. కాని గంధకమువలె మాక్షికమంతయు ఎగిరిపోవు స్వభావము కలదికాదు. కావున కొంతమందు అధికముగ నుండగలదు.

4. లోహము, కాంతము, మాండూరము, రజతము మొదలగునవి కొన్ని ఒక్కొక్కప్పుడు అగ్నిసంయోగముచే అనగా వంటయందుగాని పుటమునందుగాని అధికపరిమాణము (తూకము) కలవిగ నగును. అందుచేతనే ఒక్కొక్కప్పుడు మందు హెచ్చుగవచ్చినట్లు కనబడుచుండును.

5. వాతరాక్షసము, లోహరసాయనము, రసరాట్టు, రసభూపతి మొదలగువానినికూడ కాంతవల్లభరసమునువలె వేయింపవచ్చును. కాని ఏరకముమందైనను వేపుడుచే ఎఱ్ఱగనగును.

6. కాంతవల్లభరసము, రజతలోహరసాయనము మొదలగువానియందు గంధకము కొంత ఉండవలయును. ఎందుచేననగా గంధకమున్నప్పుడే అందలి రసభాగమే బాగుగ పనిచేయును. రసాయనత్వము అప్పుడే కలుగును. కజ్జల్యౌషధములయందు గంధకమును ప్రత్యక్షముగ తినుచునేయున్నాము. మరియు మణిశిలాదులుకూడ పనిచేయునవే కాన అవికూడ కొంతయుండవచ్చును.

7. కాంతవల్లభరసమునందు అడుగుననున్న మందును తీసివేసి పైసిందూరమునే ఉపయోగింపవలయును.

8. అభ్రకము లోహములు మొదలగువానిని సంధిబంధనము చేయకుండగనే పుటము పెట్టినచో బాగుగకాలును.

9 వంగమునకును, సీసమునకును వేయించి 2, 3 పుటములు వేయునప్పటికి వర్ణము, మృదుత్వము మొదలగునవి చక్కగ నుండగలవు. పుటములువేసినకొలదియు ఆ వర్ణము, మృదుత్వము మొదలగునవి కొంతవరకు నశించును.

10. మకరధ్వజము, సిద్ధమకరధ్వజము మొదలగు మందులను మరల వండునప్పుడు ఆ సింహూరములోనే గంధకమును కలిపి నూరక ఆసింహూరమునుండి ఇంగిలీకములోనుండివలె మరల నిజరసమును తీసి దానిలోనే గంధకమును చేర్చి నూరి వండవలయును. లేనిచో గంధకము సరిగ సమ్మేళనము కానేరదు.

11. కజ్జల్యౌషధములనుగాని వంటయౌషధములనుగాని కుప్పెలుగ కట్టునప్పుడు త్రిఫలాకషాయముతోడను కలుబందరసముతోడను నిమ్మకాయరసముతోడను మర్దించినచో కుప్పెలు నున్నగ, జిగురుగ, గట్టిగ నుండగలవు. కాని సిందూరప్రధానమగు ఔషధములను త్రిఫలాకషాయముతో మర్దించినయెడల ఆకుప్పెలు కొద్దిగ నల్లగ నుండగలవు.

## ప్రత్యేకవిషయములు.

1. మేము వండవలసినమందులనన్నిటిని సామాన్యముగ ఒకేసారిగాని; 2, 3 సారులగాని వండెదము. మరియు అన్నిమందులను నూరి సీసాలలోనికి ఎక్కించుకొని సిద్ధముగనుంచుకొని కాంతవల్లభరసము మొదలగు చాలదినములు వండవలసిన మందులను ఒకప్రక్క పొయ్యిలమీద పెట్టి మెల్లగవండుచు మిగిలిన పొయ్యిలమీద ఇతరమందులను వండెదము. అంతియగాక తయారైనకుండను దింపుచు మరల వెంటనే ఆపొయ్యిమీద ఇంకొకకుండను పెట్టుచు ఈ 6,7 రోజులలో ఒక్కొక్కపొయ్యిమీదనుండియే 2, 3 కుండలను దింపెదము. మరియు మరలవండవలసిన మకరధ్వజము మొదలగువానితో మరల వండవలసిన యితరమందులనుగాని మరియొకమందులనుగాని వండెదము.

2. అభ్రకము, శిలాజితు, మంచిముత్యములు మొదలగునవి సరియైనరకము దొరుకుట దుర్లభముగ నున్నది. కాన జాగ్రతగా పరిశీలించి మొదట మంచివస్తువులనే గ్రహింపవలయును.

3. పలశబ్దముచే మేము సామాన్యముగ మూడు తులములనే గ్రహించెదము.

4. అభ్రకము వసంతకుసుమాకరము మొదలగు చాలదినములు తయారుచేయవలసిన మందులను తయారై ఖల్వమునుండి తీసిన వెంటనే మరల ఆమందునే (క్రొత్తదానిని) ఆఖల్వములోనే వెంటనే వేసెదము. అనగా అట్టిమందులను తయారుచేయుటకు వేరువేరుగ ప్రత్యేక ఖల్వములను ఉంచెదము. ఎప్పుడును ఆఖల్వములో ఆమందునే తయారు చేయుచుందుము.

5. మేము ఒక్కొక్కసారి యొక్కొక్క సంవత్సరమునకు సరిపోవు మందులను తయారుజేసెదము. ఎప్పటికప్పుడు తయారుచేయవలసిన మందులనుగాని కొంతకాలమే నిలువయుండు మందులనుగాని వాని యొక్క స్వభావములను బట్టియే తయారుజేసెదము. మరియు చాల దినములు నిలవయుండు వంటయౌషధములు, భస్మలు మొదలగువానిని ఒకసంవత్సరమునకు సరిపోవు మందు నిలవలో ఉండకనే మరల తయారుచేసెదము.

6. కొంతమంది ఒక్కొక్కపాత్రయందు 2,3,4మందు కుప్పెలనుంచి వండెదరు. కానిమేము ఒకకుండయందు ఒకేకుప్పెనుఉంచి వండెదము.

7. అగ్నికుమారము, హుతాశనము, శీతాంశురసము మొదలగు మాత్రలుగ కూడ నుపయోగించువానియొక్క కొంతమందును కుప్పెలుగను కొంతమందును మాత్రలుగను చేసి యుంచుకొందుము మందంతయు మాత్రలుగా చేయదగిన ఇచ్ఛాభేది మొదలగువానిని కూడ కొంతమందును మాత్రలుగచేసి మిగిలినమందును కుప్పెలుగ చేసి యుంచుకొని అవసరము కలిగినప్పుడు అనగా ఆమాత్రలు అవగనే ఆ కుప్పెలను నూరి మరల మాత్రలను చేసికొనుచుందుము.

8. ఇతరపనులు సరిగ జరుగని వర్షాకాలమునందు చాలకాలమునకు తయారగు అభ్రకము, క్రవ్యాది, ఆనందభైరవి మొదలగువానిని తయారు (మర్దన) చేయించుచుందుము.

9. ఇచ్ఛాపథ్యము— అనగా చాలమంది అనేకవిధములుగ చెప్పెదరు. ఫలానవస్తువులు అనివార్యయుటకు వీలు లేదు. దేశకాలాదులనుబట్టి రోగము, తత్త్వము మొదలగువానికి అనుకూలమగు వస్తువులను సేవింపవలయుననుటయే ఇచ్ఛాపథ్యమని మా అభిప్రాయము.

# సామాన్య విషయములు.

1. అవసరములేని సంగతులను అనగా సర్వసామాన్యముగ అందరికిని తెలిసిన సంగతులనుగాని ఇదివరకు మాపుస్తకములో వ్రాయబడిన సంగతులనుగాని యోగములయందు ప్రత్యక్షముగ చెప్పబడిన సంగతులనుగాని ఈపుస్తకమునందు మరల వ్రాయలేదు. ఉదాహరణము:—ఖల్వములోవేసి మర్దింపవలయును. రసమును గంధకమును మొదట కజ్జలిచేయవలయును. ఫలానిరసములతో మర్దింపవలయును. మొదలగువానిని మరల వ్రాయలేదు. కాని అవసరమని మాకు తోచిన స్థలములయందు కొన్ని సంగతులను మాత్రము మరల మరల హెచ్చరించితిమి.

2. ఇదివరలో మాపుస్తకములలోవ్రాసిన సంగతులను మరల యిందు సాధ్యమైనంతవరకు వ్రాయలేదు. కావున ఈపుస్తకమునందలి విషయములను చూచునప్పుడు మేమిదివరలోవ్రాసిన సంగతులతో కలిపి చూడవలయును. అట్లు చేసినచో పరిపూర్ణమైనవిషయమును తెలిసికొనగలరు.

3. మేము ప్రథమమున వైద్యశాలను స్థాపించినవెంటనే అన్నిమందులను చేయవలసియుండుటచే తీరికలేక మొదటచేసినప్పుడు అన్నిమందులను వివరముగ వ్రాయలేకపోతిమి. అందుచేతనే ఈ "అనుభవదీపిక" యందు ప్రతిమందునకును మొదటిసారికి సంగతులను వివరించి వ్రాయజాలకపోతిమి.

4. ఒకమందును ఒకసారిచేయునప్పుడు జరిగినవిషయమును వ్రాసి మరల చేయునప్పుడు అదేవిషయము జరిగియున్నచో ఆవిషయమును ఈపుస్తకమునందు గ్రంథవిస్తరభీతిచే మరల వ్రాయలేదు. సూక్ష్మముగమాత్రమే వ్రాసి వదలితిమి. అవసరముకలదని తోచిన స్థలములందు యింకను కొంత వివరించి వ్రాసితిమి.

5. మేము జరిగిన సంగతులను సరిగ వ్రాసితిమి. అట్లువ్రాయునప్పుడు "సరిగ తయారుకాలేదు" "కుప్పెలు బాగుగలేవు" "గట్టితనములేదు" మొదలగు సంగతులను వ్రాసితిమి. ఆప్రకారముగ చేసినచో మీకుకూడ ఆవిషయమే సంభవింపవచ్చునని పూర్తిగ అనుకొనుటకు వీలులేదు. ఒకరుచేసినమందే కొన్ని కారణములచేగాని సమయాసమయములను బట్టిగాని యొకప్పుడు ఒకవిధముగను ఇంకొకప్పుడు ఇంకొకవిధముగను తయారు కావచ్చును. కాన కొద్దిగమార్పుచేసి తయారుచేయుటగాని ఆప్రకారముగనే తయారు చేయుటగాని చేయవచ్చును.

6. కొందరు, మేమీపుస్తకమును వ్రాయునప్పుడు సరిగ (మంచివిగ) జరిగినసంగతులనే వ్రాసి మిగిలిన విషయములన్నిటిని వ్రాయవద్దని సలహానిచ్చిరి. కాని అన్నివిషయములను వ్రాయుటవలననే పరిపూర్ణమగు విషయజ్ఞానము కలుగునని అన్నిటిని కూడ వ్రాసితిమి. అంతియేకాకుండ సరియైన పాకజ్ఞానము మొదలగువానికంటె దగ్ధపాకము మొదలగువానియొక్క జ్ఞానముకూడ అత్యవసరమేయని తలచి వానినికూడ వ్రాసితిమి.

7. కాగితమువలె సన్నముగనుండు గాజును లోనకలిగియుండి పైన మట్టిపూాయ బడి గుండ్రముగనుండు కుప్పెలను మేము సామాన్యముగా కొండపల్లికుప్పెలనియో జగ్గంపేటకుప్పెలనియో వాడితిమి.

8. ఈ "అనుభవదీపిక" యందు మందులయొక్క విషయమును వ్రాయునప్పుడు పుస్తకముపేరు పేజీ మొదలగువానిని కొన్నిటినిగాని అన్నిటినిగాని మాకు అవసరమైన వని తోచినవానినే వ్రాసితిమి. సామాన్యముగ అందరును గ్రహింపదగినచోట మరల మరల వ్రాయలేదు.

9. మేము కజ్జల్యౌషధములను చాలసార్లు చేసియున్నాము. కాని కజ్జల్యౌషధ ములను వివరముగ మరలమరల వ్రాయనవసరము లేదని వాని నిందు విశేషించి వ్రాయలేదు. కావలసిన సంగతులను చాలవరకు మా ఆయుర్వేదౌషధరత్నాకరమునందే వ్రాసితిమి. అవసరమని తోచిన కొద్దిసంగతులను ఇందు వ్రాసితిమి.

10. ఈ "అనుభవదీపిక" యందు అనుభవములను వ్రాయునప్పుడు ఇదివరకు మా పుస్తకములలో వ్రాసిన అనుభవవిషయములకు అచ్చటచ్చట కొంతభేదముగా వ్రాసితిమి. జ్ఞానాభివృద్ధికై నేరువిధములుగ చేసిచూచివానిలో సమంజసముగనున్న విషయము లను ఈ "అనుభవదీపిక" యందు వ్రాసితిమి. అందుచే కొంతభేదముగ నున్నట్లు కనబడ వచ్చును.

కొందరు చెప్పిన ప్రక్రియలను కొన్నిటిని వారుచెప్పిన

విధమున క్రింద వ్రాయుచున్నాము.

## రజతభస్మ.

దింటెనాకును గుప్పెడు తెచ్చి అదేవిధముగగాని నూరిగాని 2, 3 తులముల జరీవెండికి కవచమిచ్చి చిన్నప్రమిదలలోపెట్టి చిన్నపుటము వేయవలయును. భస్మ యగును. పిదప ఆయా పసరులతో నూరుచు 2,3 చిన్నపుటములు వేయవలెను. తెల్లగభస్మయగును.

జరీవెండిని కూతురుబుడమాకురసముతో నూరుచు పదిపుటములు వేసినచో తెల్లగ భస్మ యగును. బాగుగ నూరుచుండవలయును. మిక్కిలి చిన్నపుటములే పెట్ట వలెను. ఒక్కొక్కప్పుడు ఈభస్మకు తెలుపు కొద్దిగ తక్కువగ నుండవచ్చును.

1, 2 తులముల జరీవెండినిగాని వెండిరజనును గాని కొత్తిమిరి రసముతో 2,3 రోజులు నూరి బిళ్ళకట్టి 25 పిడకలతో పుటము వేయవలయును. ఇట్లు 4, 5 పుటములు పెట్టవలయును. కొత్తిమిరిని రసము తీయునప్పుడు నీళ్ళుపోయకూడదు. నిజరసమునే తీయవలయును. ఈభస్మ వంగపండుఛాయగ నుండును. తుదిపుటమునకు 4వ వంతు కోడిగ్రుడ్లపెంకులనుగూడ చేర్చి నూరినచో భస్మ తెల్లబడును.

1 తు॥ వెండిరజనునందు $\frac{1}{8}$ తు॥ సీసభస్మను కలిపి ముళ్ళతోటకూర రసముతో మర్దించుచు చిన్నపుటములను పెట్టవలయును.

నాగమల్లిరసముతో మర్దించుచు చిన్నపుటములను పెట్టవలయును. వెండిరజ కర్పూరశిలాజితును సమభాగములుగ గ్రహించి మూకుడునందు పేల్చి చిత్రిమూ రసముతో నూరి పుటమును పెట్టవలయును.

2 తు॥ నవాసారమును 1 తు॥ వెండిరజనును కలుబందరసముతో నూరుచు చిన్నపుటమును పెట్టవలయును.

## సూరేకారభస్మ.

కుక్కపొగాకురసముతోగాని కలుబందరసముతోగాని మర్దించి చిన్నబిళ్ళలు చేసి చిన్నపుటము వేయవలయును. లేక కలుబందరసముపోసి ఉడికించి భస్మచేయవచ్చును.

## త్రివంగభస్మ.

త్రివంగమును ముళ్ళతోటకూరతో వేయించి పుటమును పెట్టినచో పచ్చగ భస్మ యగును. నేలతంగేడాకుతో వేయించి పుటమువేసినచో తెల్లగ భస్మ యగును.

## వీర్యస్తంభనవటి.

ఇంగిలీకము, నల్లమందు, జాజికాయ, జాపత్రి, కుంకుమపువ్వు వీనిని సెత్తిగ నూరి తేనెనువేసి మర్దించి కందిగింజలవలె మాత్రలనుచేసి సేవించినచో వీర్యస్తంభనమును చేయును. మరియు దగ్గు, వగర్పు, విరేచనములు మొదలగువానినికూడ నశింపజేయును.

## భల్లాతకి.

ఎండుకొబ్బరి 4 తు॥, జీడిగింజలు 4 తు॥, బెల్లము 4 తు॥, కురాసానివాము 1 తు, కొరంజీవాము 1 తు॥, మంచివాము 1 తు॥, నేలతాడి 1 తు॥, తమలపాకుల తొడిమలు 1 తు॥, పాదరసము ½ తు॥, వంగము ½ తు॥ గ్రహించి మొదట వంగమును కరగించి యందు రసమును పోసి ముద్దగనూరినపిదప నలియగొట్టి, వస్త్రకాళితము చేయవలసినవానిని వస్త్రకాళితముచేసి అన్నిటిని ఏకముగ కలిపి బాగుగ మర్దించి జాగ్రితచేసి సెనగగింజ ప్రిమాణముగ తేనెతోవాడవలయును. సవామేహవ్యాధులన్నియు నశించును.

## గంధకమైనము.

గంధకమును కరగించి యందు చక్రకేళీ అరటిపండ్ల రసమును పోయుచు చురకాయిచ్చి పిదప తేనెనువేసి నూరి ముద్దగ ఉంచవలయును. ఇదియే గంధకమైనము. సవామేహపుపట్లు మొదలగువానిమీద మిక్కిలి చక్కగ పనిచేయును.

---

# అనుక్రమణిక



## డాక్టర్. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి అండ్‌సన్సు రాజమండ్రివారి

## ఆయుర్వేదౌషధరత్నాకరము.

ఇందు నవరత్నచింతామణి, సూతికాభరణము, త్రైలోక్యచింతామణి, సువర్ణకాంతవల్లభరసము, రజతలోహరసాయనము, సువర్ణవాతరాక్షసము, మహావాతవిధ్వంసి, వంటసువర్ణసూర్యావర్తి, సిద్ధమకరధ్వజము, మహాసిందూరభూషణము, క్రిమవృద్ధిమహాలక్ష్మీవిలాసరసము, సువర్ణక్షయ్యాది, రజతచంద్రోదయము మొదలగు సమస్తములైన వంటయౌషధములును కజ్జల్యౌషధములును కలవు. ఇంకను గొప్ప విశేషమేమనగా ఈ మందులను చేయువిధానమంతయు అతివివరముగ వ్రాయబడియున్నది. కొద్దికాలములోనే నాలుగవముద్రణముకూడ అయినదని వ్రాయుటవలన దీనియొక్క ఉపయోగమును మీరే గ్రహింపగలరు. వెల రు. 4-0-0 లు.

## ఆంధ్రభైషజ్యరత్నావళి.

ఆంధ్రదేశమునందు ప్రసిద్ధములైన అశోకారిష్టము, ద్రాక్షారిష్టము, చందనాసవము, పుష్యానుగచూర్ణము, భాస్కరలవణచూర్ణము, మదనకామేశ్వరీలేహము, నారసింహలేహము, నారాయణతైలము, చందనాదితైలము. భృంగామలకతైలము, మాదీఫలరసాయనము, భావనకరక్కాయ, శంఖద్రావకము మొదలగునవన్నియు ఇందు అతివిపులముగ వ్రాయబడియున్నవి. దీనియొక్క ఉపయోగమును బట్టి ఇదికూడ త్వరలోనే నాలుగవముద్రణమైనది.. వెల రు. 3-0-0 లు.

## భస్మప్రకాశిక.

ఇందు ప్రతిభస్మమును చేసుకొనవలసినవిధానములు అతివివరముగ వ్రాయబడియున్నవి. అంతియేకాకుండ ఇంగిలీకమునుండి రసమును తీయువిధానము, గంధకభస్మ, గంధకతైలము, గుర(మైలతుత్థ)భస్మలు, ఇంగిలీకపుకట్లు, ఇంగిలీకపుమైనములు, ఇంగిలీకభస్మ, సమస్తపాషాణములయొక్కయు శుద్ధులు, భస్మలు, మైనములు, కట్లు, మాత్రలు, పాలాస్త్రులు మొదలగునవియు నారికేళరసాయనము, తామ్రమైనము, గంధకపుష్పము, తామ్రవంగము, రజతనవనీతము, వంగనవనీతము, మాడుజీరుపట్లు, తామరతైలము, గడ్డలు, వ్రణములు మొదలగువానికి పట్టీలు మొదలగు అనేకప్రక్రియలు వ్రాయబడినవి. ఈగ్రంథము ఐదవముద్రణమై సిద్ధముగ నున్నది. వెల రు 2–0–0.

## వైద్యవిజ్ఞానము.

ఇది మాయొక్క (8వ) ఎనిమిదవ గ్రంథము. దీనిని సామాన్యమైన గ్రంథమని అనుకొనుటకు వీలులేదు. నూతనపద్ధతిలో వ్రాసితిని. నేను వైద్యము. ప్రారంభించినది మొదలు వైద్యమునుచేయుట, ఫార్మశీని అభివృద్ధిపరచుట, గ్రంథములనువ్రాయుట మొదలగు నేటివరకునుగల సమస్తవిషయములను విపులీకరించి వ్రాసితిని.మరియు నాయొక్క పుట్టుకమొదలు వైద్యవిద్యనభ్యసించుటవరకుగల ప్రత్యేకవిషయములను గూడ వ్రాసితిని నాకు సుమారు 35 సంవత్సరములనుండికల వైద్యానుభవముతో నేనిదివరలో అనేకగ్రంథములలోవ్రాసిన ఔషధయోగవిమర్శనములకంటె ప్రత్యేకమగు విమర్శనములను, అనేకవ్యాధిచికిత్సావిమర్శనములను ఇందు వ్రాసితిని. సుమారు 2-8-0 లు వ్యయపరచినచో అమూల్యములగు అనేకవిషయములను గ్రహింపనగలమనెడి విషయమును మీరే గ్రహింపవలసియున్నది. వెల రు. 2—8—0